## గంటల పంచాంగం

ఖర సం॥ భాద్రపద శు॥ షష్ఠి
1951 సం॥ సెప్టెంబరు 7 శుక్రవారం
శు॥షష్ఠి ప 2-39 విశా ప 3-38 వర్జ్యం
రా 7-20 ల 8-57 కు.
శు॥ సప్తమి సెప్టెంబరు 8 శనివారం
శు॥ సప్తమి ప 12-46 అనూ ప 2-29
వర్జ్యం రా 7-45 ల 9-16 కు.


# ఆంధ్రపత్రిక

ఒరులేయవి యొనరించిన నరవర,
యప్రియము తన మనంబున కగు దా
నొరులకు నవిసేయకునికి పరాయణము
పరమధర్మపథముల కెల్లన్. (మహాభారతము)

ఖర సం॥ భాద్రపద శు॥ షష్ఠి
శుక్రవారం


## ధాన్యం ధరలు

ఇతర రాష్ట్రాల్లో, ఆరాష్ట్ర ప్రభుత్వాలు నిర్ణయించిన ధాన్యం ధరలు, ఈ రాష్ట్రంలో రాష్ట్రప్రభుత్వం నిర్ణయించిన ధరలకంటే ఎక్కువగా ఉన్నట్లు అహారశాఖా మంత్రి అంగీకరించారు. తిరిగి పంటలకాలం వచ్చేలోపున ధాన్యం ధరను పెంచే విషయంలో కేంద్ర ప్రభుత్వంతో సంప్రదించగలమనికూడా వారు మంగళవారం అసెంబ్లీ సమావేశంలో వాగ్దానం చేశారు. ఇది ఎన్నడో జరుగవలసినపని. ధాన్యం ధరను నిర్ణయించే అధికారం కేంద్ర ప్రభుత్వానిది. ధాన్యాన్ని సేకరించవలసిన బాధ్యతమాత్రం రాష్ట్ర ప్రభుత్వానిది. అధికారం ఒకరిపరంగానూ, బాధ్యత మరొకరి మీదా ఉంటంవల్ల ఫలితాలు సంతృప్తికరంగా ఉండవని 1946, 47 సంవత్సరాల్లో ఈ రాష్ట్ర ప్రభుత్వమే నిరూపించింది. ధాన్యంధర పెంచడం సాధ్యంకానందునసే అప్పట్లో రాష్ట్ర ప్రభుత్వం రైతులకు 'బోనసు' ఇచ్చే పద్ధతిని ప్రవేశపెట్టింది. ఇందులో కొంత ఖర్చును భరించి కేంద్ర ప్రభుత్వం ఈ పద్ధతికి ప్రచ్ఛన్నంగా తన ఆమోదాన్ని తెలిపింది.

క్రమేపీ ప్రభుత్వ ఆర్థికస్థితి క్లిష్టం కావడంవల్ల అహార ధాన్యంకింద రాష్ట్రప్రభుత్వాలకు సబ్సిడీలు ఇవ్వడం విరమించుకుంది. ధాన్యం ధరలు పెంచడానికి మాత్రం సమ్మతించలేదు. సేకరణ ధరలలో ఈ రాష్ట్రానికీ, ఇతర రాష్ట్రాలకూ వ్యత్యాసం ఉంటున్నా, విదేశాలనుండి దిగుమతి అవుతున్న ధాన్యానికి ప్రభుత్వం చెల్లించుకుంటున్న ధరకూ స్థానికంగా సేకరించే ధాన్యానికి చెల్లిస్తున్న ధరలకూ ఎంతో వ్యత్యాసం ఉంటున్నది. ప్రభుత్వ ధాన్యసేకరణ అనుకున్నంత, ఆశించినంత జయప్రదం కాకపోవడానికి ప్రధాన కారణం ఈ తక్కువ ధరలే. ఈ రాష్ట్రప్రభుత్వం ఈ విషయాన్ని గ్రహించికూడా సేకరణ ధరను పెంచడానికి ఇంత వరకూ ఎట్టి ప్రయత్నముచేయలేదు.

పైగా ఇప్పటి ధరలమీదనే రైతులు ఎక్కువగా లాభాలు పొందుతున్నారని భావించి భూమిశిస్తుపై సర్‌చార్జి విధించడానికి ఈ రాష్ట్ర ప్రభుత్వం ప్రయత్నించింది. ఈ ప్రతిపాదనలను రాష్ట్రంలోని అన్ని వర్గాలవారు తీవ్రంగా విమర్శించడంవల్ల ఆఖరు క్షణంలో ఈ 'సర్‌చార్జి' విధించే ప్రయత్నాన్ని విరమించుకున్నది. ఈ సందర్భంలో ప్రస్తుతం వ్యవసాయదారుల ఆర్థికస్థితిఏవిధంగా వుందో రాష్ట్రప్రభుత్వం విచారించివుంటే ఈ సర్‌చార్జీ విధింపును విరమించుకోవడమే గాకుండా, ధాన్యం ధరలను పెంచడం అవసరమని గ్రహించి ఉండేదికూడా. పది ఎకరాలలోపు రైతుల స్థితి ఇదివరకెలా ఉందో ఇప్పుడూ అలాగే ఉంటున్నది. అప్పటికీ ఇప్పటికీ ఒక్కటే తేడా వుంది. ధరలు తక్కువగాఉండి, పుట్టి యాభై రూపాయిలు మాత్రమే అమ్ముతున్న రోజుల్లో ఈ తరగతి రైతు లందరూ అప్పులపాలైనవారే. ఇప్పుడు ఆ స్థితి లేకుండా వచ్చిన ఆదాయాన్ని సరిపెట్టుకోగలుగుతున్నారు. అంతకు మించి సామాన్య రైతులు పొందుతున్న ప్రయోజనం కూడా ఏమీ లేదు.

ఈ ధరలను ఇలాగే నిలిపి ఉంచగలమని రాష్ట్రప్రభుత్వంగానీ, కేంద్రప్రభుత్వంగానీ హామీ ఇవ్వలేదు. అలాంటి పరిస్థితుల్లో ఇప్పటి 'గిరాకీ'వల్ల ప్రయోజనాన్ని పొందడానికైనా రైతులకు అవకాశమివ్వకపోవడం న్యాయంగాదు.

రైతులు తాము కొనవలసిన వస్తువులను మాత్రము విశేషంగా బ్లాక్‌మార్కెట్‌లోనే పొందవలసి వస్తున్నది. పారిశ్రామిక వస్తువుల ధరల నిర్ణయంలో మాత్రం ప్రభుత్వం ఇటు వాడుకదారుల స్థితినేగాక, అటు ఉత్పత్తిదారులస్థితిని కూడ ఎక్కువగా గమనించుచున్నది. అహార ధాన్యముల ధరలను నిర్ణయించే విషయంలో పంటదారులను పూర్తిగా విస్మరించి వాడుకదారులనుమాత్రమే గమనించుచున్నది. ప్రస్తుత పరిస్థితులలో ధాన్యం ధరలను పెంచడానికి భారతప్రభుత్వం అంతసులభంగా సమ్మతించదు. కాని ఒక రాష్ట్రంలో ధరకూ, మరో రాష్ట్రంలోధరకూ వ్యత్యాసం లేకుండా చేయడంమాత్రం ప్రభుత్వ విధియైయున్నది. ఈ రాష్ట్రప్రభుత్వం గట్టిగా, పట్టుదలతో పనిచేస్తే ధరలను ఇతర రాష్ట్రాలతో సమంగా చేయడానికి కేంద్రప్రభుత్వం అంగీకరించక తప్పదు.

## కాశ్మీర్‌పై కరాచీ శ్వేతపత్రం

### సంస్థాన ప్రభుత్వఖండన

న్యూఢిల్లీ, సెప్టెంబరు 6: కాశ్మీర్ రేడియో ప్రసారాలను గూర్చి పాకిస్తాన్ ఈమధ్య జారీచేసిన శ్వేతపత్రం అంతా పెద్దతప్పుల తడికగా వున్నదని కాశ్మీర్ జమ్ముసంస్థాన ప్రభుత్వం శనివారం ప్రకటనచేసింది.

ప్రసారాలను అస్తవ్యస్తం చేయడం విక్షిప్తము, ప్రక్షిప్తము చేయడం, ఈ శ్వేతపత్రంలోని కొన్ని తప్పులుగా ఈ ప్రకటనలో పేర్కొనబడింది. వీటి అన్నింటికంటే పెద్దతప్పు ఏమిటంటే ప్రసారంలో వాడిన భాషను సరిగ్గా అర్థముచేయక పోవడం. అయితే ఈ తప్పడు తర్జుమా చేయడంగూడా దురుద్దేశంతోనే కూడివున్నదని. పాకిస్తాన్ ప్రచారం ప్రయోజనాలకు అనుగుణంగా ఈతర్జుమాలు జరిగాయని ఈ ప్రకటనలో వివరించబడింది.

### పరిషత్తు ఎన్నికల్లో జాతీయ మహాసభ విజయం

శ్రీనగర్ సెప్టెంబరు 6: కాశ్మీర్ రాజ్యాంగ పరిషత్తుకు జరిగిన ఎన్నికలలో కాశ్మీర్ జాతీయసంస్థ అభ్యర్థులకు అఖండవిజయం చేకూరడం, ఇండియాలో చేరాలన్న వారిఆశయాన్ని కాశ్మీర్ ప్రజలు గుర్తించినట్లు స్పష్టముగా తెల్పివేసింది అని బక్షీగులాం అహ్మద్ నేడు ఉద్ఘాటించారు.

అదీకాక కాశ్మీర్ ప్రజలకు వారి సకలంపట్ల వారికి వున్న విశ్వాసాన్ని గూడా ఈ ఎన్నికలు బల్లగుద్ది చేప్తాయని బక్షీగులాం అహ్మద్ అన్నారు. ఈప్రజల ఆశయాలకు విరుద్ధంగా ఎట్టి నిర్ణయాన్ని తీసుకువచ్చి రుద్దుదామని ఎవరు చూచినా, వారు, ఆనిర్ణయాన్ని సహించరు. ప్రాణాలు ఒడ్డి నిశ్చేపంవంటి తమకోర్కెని రక్షించుకుంటారు అని ఆయన హెచ్చరించారు.

## బ్రిటన్‌కు పర్షియా అంత్యసందేశం

(1 వ పేజీ తరువాయి)

లకు సమాధానంగా ఈ చర్య జరపడానికి నిశ్చయించినట్లు ఉపప్రధానమంత్రి హుస్సేన్ ఫాతెమి ప్రకటించారు. ఆయన ఇంకా యిలా చెప్పారు:

"నూనె తగాదా పరిష్కారానికి యెట్టి చర్యలు జరపకుండా ఊరక ఉండి, మొసాదిక్ ప్రభుత్వం అధికారంనుండి తొలగింపబడేవరకు చూస్తూ ఉండాలని బ్రిటన్ తలుస్తున్నది. బ్రిటిషు పనివారు దేశంనుండి వెళ్ళిపోతే, స్విట్జర్లాండు, స్వీడన్, హాలెండుదేశాలనుండి, సాధ్యమైతే రష్యానుండి నిపుణులను రప్పించడానికి పర్షియా ప్రయత్నిస్తుంది. అమెరికనులను కుదుర్చుకోవాలనే కోరిక పర్షియాకులేదు. వారు కూడా బ్రిటన్ విధానాన్నే అనుసరించవచ్చు."

పార్లమెంటు ప్రతినిధుల సభలో ప్రధాని ప్రతిపాదనపై రేపు ఓటింగు జరుగుతుంది. ప్రతినిధుల సభకూడా ఆమోదిస్తే బ్రిటన్‌కు వెంటనే ఆసందేశం పంపడం జరుగుతుంది.

పర్షియాప్రధాని మొసాదిక్ తన ప్రసంగంలో ఇలా చెప్పారు:—

"హేరిమాన్ రాయబారాలు భగ్నం కావడానికి ముందు పర్షియా కొన్ని ప్రతిపాదనలు చేసినది. అదే ప్రతిపాదనలు ప్రాతిపదికగా రాయబారాలు పునః ప్రారంభించాలని బ్రిటన్‌కు సూచించడం జరుగుతుంది." అప్పట్లో పర్షియా చేసిన ప్రతిపాదనలు ఇవి:—

(1) బ్రిటన్ అవసరాలకు చాలినంత నూనెమాత్రమే బ్రిటన్‌కు విక్రయించడము. బ్రిటన్ పవర్ ఆఫ్ అటార్నీ ఇచ్చినట్లయితే ఇతర దేశాలకు కూడా విక్రయించడము. (2) పర్షియాలోని నూనెసంస్థ ఆస్తులకు ఇచ్చే నష్టపరిహారాన్ని చర్చలద్వారా నిర్ణయించడము. (3) బ్రిటిష్ పనివారు అబడాన్‌లో ఉండి పనిచేయడానికి సంబంధించిన ఏర్పాట్లను చర్చల ద్వారా నిర్ణయించడము.

(1) బ్రిటన్‌కు మాత్రమే నూనె అంతటినీ విక్రయించడానికి కాని, (2) అబడాన్‌లో బ్రిటిష్‌వారి మేనేజిమెంటు ఉండడానికి కాని, (3) పర్షియా నూనె విక్రయంపై బ్రిటన్‌కు కమిషన్ ఇవ్వడానికి కాని పర్షియా అంగీకరించదని ప్రధాని మొసాదిక్ స్పష్టపరిచారు. పర్షియా కోరికలకు అనుగుణంగా బ్రిటన్ ప్రతిపాదనలు చేసినట్లయితే వాటిపై చర్చించడానికి కూడా పర్షియా అంగీకరిస్తుందని మొసాదిక్ ప్రకటించారు.

ఆంగ్లో-ఇరానియన్ నూనె సంస్థకు చెందిన నూనెను ఇతర దేశాలకు విక్రయించడానికి పర్షియా ప్రయత్నిస్తే పర్షియాకు ఆక్షేపణ తెలియపరచడం జరుగుతుందని బ్రిటిష్ విదేశాంగశాఖ ప్రతినిధి ఒకరు లండన్‌లో చెప్పారు. పర్షియా ప్రభుత్వంనుండి నూనె కొనడానికి విదేశాలు కాని, విదేశీయులు కాని, సిద్ధపడితే, తమఆస్తి రక్షించుకోవడానికి తగినచర్యలు జరుపగలమంటూ ఆంగ్లో-ఇరానియన్ నూనె సంస్థ లండన్‌లో హెచ్చరించినది.

ప్రస్తుతం ఖుజిస్తాన్‌లో ఎనిమిది రిఫైనరీలు తిరిగి పనిచేయడం ప్రారంభించినట్లు పర్షియానూనె సంఘ సభ్యుడు హుస్సేన్ మక్కి ప్రకటించారు.

### అంతిమ సందేశానికి వాయిదా

అనంతరం పర్షియా మంత్రివర్గం నేటిరాత్రి సమావేశమై, బ్రిటన్‌కు అంతిమసందేశం పంపడానికి వాయిదా వేయడానికి నిశ్చయించినది. పర్షియా రాజుకు ఈ విషయం తెలియపరచడం జరగలేదని హుస్సేన్ ఫాతెమి చెప్పారు.

## పర్షియాకు బ్రిటన్ హెచ్చరిక

లండన్, సెప్టెంబరు 6: అబాదాన్‌లో మిగిలివున్న తమ ఉద్యోగులను తొలగించినట్లయితే, అది అంతర్జాతీయ న్యాయస్థానంవారు తాత్కాలికంగా ఇచ్చిన తీర్పుకు విరుద్ధం కాగలదని బ్రిటన్ నేడు పర్షియాకు తెలియజేసింది.

ఆ న్యాయస్థానంవారి ఈ తీర్పు ప్రకారం మే 1 నాడు వున్న పరిస్థితులకు ఈరీతిగానూ కాలూను ఏ పక్షంవారుగాని విరుద్ధంగా ప్రవర్తించేందుకు వీలులేదు. కోర్టువారు పూర్తి తీర్పు ఇచ్చేదాకా ఈ తీర్పు చెల్లుబడి అవుతుంది.

ఈ నూనెతగాదా విషయమై బ్రిటన్ తిరిగి పర్షియాతో సమాలోచనలు ప్రారంభించడానికి సంసిద్ధంగానే వున్నదని, అయితే, యీ సమాలోచనలకు ప్రాతిపదికలుగా వుండవలసినసూచనలు కొత్తవి అయివుండాలని, పూర్వం బ్రిటన్ నిరాకరించిన సూచనలు అందుకు ఎందుకు పనికిరావని బ్రిటిష్ విదేశాంగశాఖ ఉద్యోగులు చెబుతున్నారు. ఇక యీలోపుగా, ఆంగ్లో ఇరానియన్ కంపెనీ ఆస్తిగావున్న నూనెను పర్షియా ఏ మాత్రం అమ్మినా, ఆవిషయం కోర్టులకు ఎక్కించబడగలదని వీరు అంటున్నారు. అదీకాక ఈ అమ్మకం విషయమైన అనౌచిత్యాన్ని బ్రిటన్ ఇతరదేశాల దృష్టికి గూడా తెస్తుంది. ఈవిషయంలో గూడా బ్రిటన్ అంతర్జాతీయ న్యాయస్థానం తాత్కాలికంగా ఇచ్చిన తీర్పు మీద ఆధారపడి ప్రవర్తిస్తున్నది.

## ప్రాయోపవేశంచేస్తున్నవారి స్థితి

1 వ పేజీ తరువాయి

వరకూ బసచేస్తున్న జాతీయవాది కొండా వెంకటప్పయ్య పంతులుగారి యింటినుంచి రేవ జార్జి పురమందిరానికి తరలివెడిలి నూర్చారు. పురజనులు వీరిని నిన్న సాయంకాలం పెద్ద ఊరేగింపుతో పురమందిరానికి తీసుకొని వచ్చారు. అక్కడ కావలసిన అన్ని వసతులను డా॥ అమ్మంశెర్ల చలపతిరావు, ఏకా అంజనేయులు, నీరం సుబ్బారావునాయుడు, మునిసిపల్ చైర్మన్ పుప్పూటూరి పున్నయ్యగార్లు ఏర్పాటు చేశారు.

స్వామీజీబృందంతోపాటు పాకాల సుబ్బారావు, మునునూరి పుంఛరీ కాక్షుడు, కొసరాజు లక్ష్మీనారాయణ గార్లుకూడా యీ 1 నుండీ ప్రాయోపవేశం ఆరంభించారు. ఆర్. కె. రామలింగారెడ్డి గారి సోదరి బొమ్మా ఈశ్వరమ్మగారు ఒక్కరోజు పుపవాసం ఆరంభించారు. గీతావళి పత్రిక సంపాదకుడు శ్రీ కంఠంగారు మూడురోజులవుపవాసం చేస్తున్నారు.

పురమందిరం చేరిన వెంటనే స్వామీజీ ప్రార్థనలు జరిపారు. తదనంతరం ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారి అధ్యక్షతను బహిరంగ సభ జరిగింది. ఆ సందర్భంలో స్వామీ సీతారాం ఇలా ప్రసంగించారు. "మహా యజ్ఞంలో యజ్ఞపశువును పూరేగిస్తారు. అలాగే యిప్పుడు జరుగుతున్న యీ ఆంధ్ర మహాయజ్ఞంలో యజ్ఞపశువును కూడా మీరు పూరేగింపుతో దేశభక్తుని యింటనుంచి యిక్కడకు తెచ్చారు. ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి ఆటంకం నెహ్రూగారే. ఆ మహామహునిమనస్సుమారితే ఆంధ్రరాష్ట్రం మూడు నిముషాలలో వస్తుంది. వారి హృదయం మారాలనే నా తపస్సు."

నేటి సాయంకాలం ప్రార్థనానంతర ప్రసంగం సందర్భంలో ప్రత్యక్షచర్యకు దిగవలసిందిగా తమకు కొందరు చేసిన సూచనను గూర్చి చెప్పి, ఒకవంకను కేంద్ర ప్రభుత్వంతో పుత్తర ప్రత్యుత్తరాలు, సంప్రదింపులూ జరుపుతూ, మరోకవంక ప్రత్యక్షచర్యకు దిగుతున్నామని కత్తులునూరటం గౌరవనీయం కాదని స్వామీజీ అన్నారు.

అమరావతి, మంగళగిరి, గుంటూరు శివాలయం మొదలగు అలయాలనుండి స్వామీజీకి తీర్థము, విభూతి అందుతున్నవి. ప్రజలు తండోపతండాలుగా వచ్చి స్వామీజీ దర్శనం చేసుకొంటున్నారు. స్వ. వి.

స్వామీజీకి యీ 3-వ సందేశాలలో రంగాగారు పంపిన సందేశం కూడా ఒకటి వున్నది. ఆయన యీ పుద్యమానికి తమ మనః పూర్వకమైన సానుభూతి వున్నట్లు వ్యక్తం చేశారు. పట్టణ పత్రికారచయితల సంఘంవారు నిన్న సాయంకాలం సమావేశమై ప్రాయోపవేశం చేస్తున్న వీరందరి ప్రాణాలను కాపాడటానికి భారత ప్రభుత్వం వెంటనే ఆంధ్రరాష్ట్ర విభజన జరిపించాలనీ, అట్లు చేయని పక్షంలో రాగల ఫలితాలకు భారత ప్రభుత్వమే బాధ్యత వహించాలని తీర్మానంచేశారు. తదితర అనేక సంఘాలవారు కూడా యీమాదిరి తీర్మానాలను చేశారు.

ఆంధ్రవిద్యార్థి ఫెడరేషన్ కార్యదర్శి తాము అవలంబించబోయే మార్గాన్ని గూర్చి స్వామీజీతో నిన్న దర్శించారు. ఫెడరేషన్ వారుకూడా ముఖ్యమంత్రివద్దకు రాయబారం వెళ్లాలనుకొంటున్నారు.

### నెహ్రూకు స్వామీ సీతారాంలేఖ

గుంటూరు, సెప్టెంబరు 6: సంకల్పమంటూ వుంటే సాధనాలకేమీ కొదవ వుండదని స్వామీ సీతారాం గారు తాము నిన్న భారతప్రధాని నెహ్రూకు వ్రాసిన లేఖలో పేర్కొన్నారు. ప్రత్యేకంగా ఆంధ్రరాష్ట్రం స్థాపించే ముందు, పదిమంది నిజాయితీ పరులైన నాయకులు, అధికారులతో ఒక 'కేర్ టేకర్' ప్రభుత్వాన్ని ఏర్పాటుచేసి వీరిద్వారా ఆంధ్రప్రాంతంలో దైనందిన పరిపాలనా కార్యక్రమాన్ని కొనసాగించ వచ్చునని స్వామీజీ ప్రధానికి సూచించారు. 150 ఏండ్లు భారతదేశాన్ని పరిపాలించిన బ్రిటిషువారు చివరకు తమఅధికారాని వదులుకొని వెళ్లవలసి వచ్చినప్పుడు, ఆ కార్యక్రమమంతా పూర్తికావటానికి 2నెలలకంటే ఎక్కువకాలం పట్టలేదు. అవిధంగానే ఆంధ్రరాష్ట్ర విభజనచేయాలనే సంకల్పమే వుంటే అందుకు మార్గాలు వుండకపోవని స్వామీజీ అన్నారు.

రాజకీయాశయాలను నెరవేర్చుకొనేందుకు ప్రాయోపవేశాన్ని ఒక సాధనగా వుపయోగించటం తనమనస్తత్వానికి పూర్తిగా వ్యతిరేకమని నెహ్రూగారు అన్నదానిపై వ్యాఖ్యానిస్తూ స్వామీజీ తాము కేవలము పూజ్య బాపూజీ అడుగుజాడల్లోనే నడుస్తున్నామనీ, బాపూజీ అవలంబించిన మార్గాల నిజాయితీని కాంగ్రెసువారు యీనాడు శంకింపసాగటం శోచనీయమనీ అన్నారు.

ఆంధ్రరాష్ట్రంతో సంబంధంవున్న అన్ని పక్షాలమధ్య ఏకాభిప్రాయం కుదురుతేకాని వాలనే వాదాన్ని గూర్చి వ్యాఖ్యానిస్తూ, కొన్ని కొన్ని సమస్యల విషయంలో మహామేధావుల మనుసే ఏకాభిప్రాయ మనేది కుదరకపోవచ్చునని అంటూ, ఇందుకు వుదాహరణలుగా కాశీహిందూ విశ్వవిద్యాలయం విషయంలో గాంధీజీ-మాలవ్యాల మధ్యనూ, పాకిస్తాన్ అవతరణం విషయంలో గాంధీజీ-జిన్నాలమధ్యను

## శాన్‌ఫ్రాన్సిస్కో సభ

(1 వ పేజీ తరువాయి)

సమావేశంలో దీర్ఘప్రకటన చేశారు. తనప్రసంగంలో ఆయన ఇలా చెప్పారు: "అమెరికా, బ్రిటన్‌లు తయారుచేసిన శాంతిసంధి ముసాయిదా అన్నివిధాలా న్యాయంగా ఉన్నది. ప్రతీకారం తీర్చుకోవాలనే ఉద్దేశ్యంతో ఇది తయారు చేయబడలేదు.

ఈ సంధిలో అమెరికా జపాన్‌పట్ల ఔదార్యం చూపినది. ఇది సంధిపై సంతకంచేసే దేశాలన్నిటికి ప్రయోజనకరమైన పద్ధతి. ఆక్రమణ కాలంలో జపాన్‌కు మార్గదర్శకత్వం వహించిన జనరల్ మెకార్థర్‌కు మనమేకాక మన తరువాతి తరాల వారుకూడా చాలఎక్కువగా ఋణపడిఉన్నారు."

శాంతిసంధి అములులోనికి వచ్చిన తరువాత 90 రోజులలోగా ఆక్రమణ సైన్యాలన్నిటిని జపాన్ నుండి ఉపసంహరించాలని సోవియెట్ ప్రతినిధి వర్గనాయకుడు ఆండ్రీగ్రోమికో నిన్నటి సమావేశంలో ప్రతిపాదించారు.

నిన్నటి సమావేశం ప్రారంభంకాగానే బ్రిటన్ అమెరికాలు ప్రతిపాదించిన కార్యక్రమ నిబంధనలను సమావేశం ఆమోదించినది. ఈ నిబంధనలకు అనుకూలంగా 48 దేశాలు ఓటుచేసినవి. రష్యా, పోలెండు, చెకోస్లావేకియాలు ప్రతికూలంగా ఓటు చేసినవి. గ్రోమికోకు ఇది రెండవ ఓటమి. మొదటిరోజు సమావేశంలో కమ్యూనిస్టు చైనా కూడా సమావేశంలో పాల్గొనడానికి అంగీకరించాలంటూ ఆయనచేసిన ప్రతిపాదన వీగిపోయినది. కాని గ్రోమికో ప్రతిపాదన చెల్లదని అధ్యక్షుడు డీన్ ఏచిసన్ నిర్ణయించారు. ఆయన నిర్ణయాన్ని సమావేశం ఆమోదించినది.

దీర్ఘకాలం ప్రసంగిస్తూ, సకాలములో శాంతి సంధిపై సంతకాలు జరగకుండా చేసే ప్రయత్నాలు నిరోధించే నిమిత్తం బ్రిటన్, అమెరికాల నిబంధనావళి ఉద్దేశింపబడినది.

కమ్యూనిస్టుచైనావిషయంలో గ్రోమికో ఇలా చెప్పారు:- "జపాన్ శాంతిసంధిలో పాల్గొనడానికి చైనా ప్రజలకు హక్కు ఉన్నది. యుద్ధానంతరం జరిగిన కెయిరో సమావేశం కూడా యీ హక్కును దృఢపరుస్తున్నది. ఈ సమావేశంలో చైనా పాల్గొనకుండాచేయడం ఆక్రమము."

నిబంధనావళి ఆమోదించడంపై చర్చజరుగుతున్న కారణంగా గ్రోమికో ప్రతిపాదన చెల్లదని ఏచిసన్ నిర్ణయించారు. అనంతరం నిబంధనావళిపై చర్చ ముగిసిన తరువాత ఆ ప్రతిపాదన తిరిగిచేసే హక్కు తనకు ఉన్నదని గోమికో చెప్పారు. ఆయన ప్రతిపాదన బలపరుస్తూ పోలెండు చెకోస్లావాకియాల ప్రతినిధులు ప్రయత్నించారు. వారు ప్రసంగించడానికి వీలులేదని ఏచిసన్ నిర్ణయించారు.

### ట్రూమన్ ప్రారంభోపన్యాసం

మొదటిరోజు సమావేశానికిప్రారంభోత్సవం చేస్తూ అమెరికా అధ్యక్షుడు ట్రూమన్ ఇలా చెప్పాడు: "ఏదేశాలు యుద్ధాన్ని కొనసాగించాలని కోరుతున్నది, ఏదేశాలు ప్రపంచ యుద్ధం నిరోధించడానికి ప్రయత్నిస్తున్నది ఈసమావేశంలో బయటపడగలదు. జపాన్ శాంతిసంధి ప్రపంచంలో శాంతిసెలకొల్పడానికి ఒక మార్గం, కార్యాచరణ విధానము నిర్దేశిస్తున్నది. పసిఫిక్ ప్రాంతంలో సుస్థిరమైన శాంతి నెలకొల్పడానికి జరుగుతున్న ప్రయత్నాలలో ఇది అత్యంత ప్రధానమైనది. ఇందుకు గాను ఇంకా మరికొన్ని చర్యలుకూడా జరుపవలసి వున్నది. జపాన్ స్వతంత్రమై, కోరి యీ ప్రజలకు భద్రత చేకూరిన తర్వాత ఆ ప్రాంతంలో నితర సమస్యలను పరిష్కరించవచ్చు. యుద్ధానంతరం మిత్రదేశాలు విధించిన లొంగుబాటు షరతులను తుచ తప్పకుండా పాటించినందుకు జపాన్‌ను ప్రశంసించవలసి ఉన్నది. పెరల్ హార్బర్ బటాన్ దురంతాలను అమెరికా ఇంకా విస్మరించలేదు. అదేవిధంగా ఇతర దేశాలు కూడా విస్మరించలేని కొన్ని దురంతాలు ఉన్నవి.

పెరల్ హార్బర్ దురంతం జరిగిన పదిసంవత్సరాలకు, జపాన్ ఓడిపోయిన ఆరుసంవత్సరాలకు ఈసమావేశం ప్రారంభమైనది. సమావేశానికి ప్రారంభోత్సవం చేసినవెంటనే ట్రూమన్ పోలస్ హోటలుకు వెళ్ళారు. ఆహోటల్‌లో ప్రతినిధులకు విందు జరిగినది.

శాంతి సంధి సమావేశం ఒకనెల రోజులవరకు జరుగుతుందని తెలుస్తున్నట్లు ఆండ్రీగ్రోమికో బ్రిటిషు ప్రతినిధి వర్గనాయకుడు కెనెత్ యంగర్ చెప్పారు.

ర్యూక్యూ, బోనైన్ ద్వీపాలు సంపూర్ణంగా జపాన్ సార్వభౌమాధికారం క్రింద ఉంచేటట్లు చేయడానికి తగిన సవరణలకు ప్రతిపాదించమని అధ్యర్థిస్తు ఆద్వీపాలలో ఇటీవల స్థాపించబడిన ఒక సంఘం ఇక్కడి వివిధ ప్రతినిధి వర్గాలవారికి లేఖలు పంపినది.

పాకిస్తాన్ తరపున జపాన్ శాంతి సంధిపై సంతకం చేయనున్నట్లు పాకిస్తాన్ విదేశాంగ మంత్రి సర్ మహమ్మద్ జఫ్రుల్లాఖాన్ గతరాత్రి ప్రకటించారు.

---

పొడసూపిన అభిప్రాయభేదాలవిషయం స్వామీజీ ప్రసక్తికి తెచ్చారు. కొబట్టి ఈ మాదిరిగా అభిప్రాయభేదాలు పొడసూపినప్పుడు అన్ని పక్షాలవారూ మధ్యవర్తిత్వానికి ఒప్పుకోవటం నాగరికలక్షణమనీ, సర్వోదయ రంగంలో మధ్యవర్తిత్వాన్నే హెచ్చుగా ఆమోదించి, ఆచరిస్తారని స్వామీజీ తమ లేఖలో వివరించారు.

## స్వామి సీతారాంకు సంజీవరెడ్డిగారి లేఖ

(1-వ పేజీ తరువాయి)

కాన్ని విరమించవలసిందిగా ఆం. కాం. అధ్యక్షుడు నీలం సంజీవరెడ్డి గారు నేడు ఒక లేఖను తయారుచేశారు. ఆర్థికమంత్రి బెజవాడ గోపాలరెడ్డిగారు స్థానిక శాఖామంత్రులు కల్లూరి చంద్రమౌళి గారలుకూడా ఈలేఖపై సంతకం చేశారు.

### లేఖ పూర్తిపాఠం

మదరాసు.
6—9—1951.

పూజ్యులైన స్వామి సీతారామ్‌గారికి,
నమస్కారాలు.

వార్ధక్యాన్ని కూడా పరిగణింపకుండా పట్టుదలతో మీరు ప్రారంభించిన ప్రాయోపవేశం మీచిత్తశుద్ధిని, మీసంకల్ప శక్తిని, మీ నిశ్చల దీక్షను వేనోళ్ల చాటుతున్నది. ప్రత్యేక రాష్ట్రంకోసం మీరు చేస్తున్న ప్రయత్నం ప్రశంసాపాత్రం. యావదాంధ్రులు మీకు సర్వదా కృతజ్ఞులు.

ఆంధ్రరాష్ట్రం కోసం మీవలెనే మేము కూడా కృషి చేస్తున్నామని చెప్పటానికి గత చరిత్రే తార్కాణం. కొన్ని కష్టనష్టాలను సైతం సరకుచేయక, ముందు మనకు ప్రత్యేకరాష్ట్రం రావడమే ప్రధానమనే ఉద్దేశ్యంతోనే ఆనాడు విభజన సంఘనివేదికను ఇష్టములేకున్నా, లేకపోయినా మేము అంగీకరించవలసి వచ్చింది. అప్పుడు శ్రీప్రకాశం, రంగాగారలు దానిని వ్యతిరేకించటం వల్లనే 1950 జనవరిలో అవతరిస్తుందనుకొన్న ఆంధ్రరాష్ట్రం అదృశ్యమైపోయింది. దీనికి ముఖ్యంగా మన ఆంధ్రులలోని అనైకమత్యమే కారణంగాను ఐక్యతకోసము తాము పాటుపడుట సమంజసము.

రాష్ట్ర సాధన సమస్యకు ప్రాయోపవేశం పరిష్కారమార్గం కాదని మా అభిప్రాయం. అసలు మీరు ఈ కఠిన వ్రతం ప్రారంభించాలని సంకల్పించకపూర్వమే మన మందరం కలిసి సంప్రదించుకొని, ఒక కార్యక్రమం నిర్ణయించుకొని, దానిప్రకారం నడుచుకొంటే బాగుండేది. కాని, గతాన్ని గూర్చి విచారించి ప్రయోజనం లేదు. ఇక ప్రస్తుత కర్తవ్యం నిర్ణయించుకోవాలి.

మీ ప్రాయోపవేశ ఫలితంగా ప్రస్తుతం యావదాంధ్రుల దృష్టి ఆంధ్రరాష్ట్ర సమస్యమీదకు మరలింది. దేశంలో ఒక నూతన చైతన్యం బయలుదేరింది. ఒక నూతనోత్సాహం కలిగింది. ఇప్పుడు ఆంధ్రరాష్ట్ర నిర్మాణకృషికి అనువైన వాతావరణం ఏర్పడింది. మీ సంకల్పం త్వరలోనే నెరవేరుతుందని మా విశ్వాసము.

ఈ విషయంలో మద్రాసు ప్రభుత్వం చేయగలిగినదంతా చేసింది. మేము ఇప్పుడే ఢిల్లీకి బయలుదేరుతున్నాము. రాష్ట్రం విషయమై భారత ప్రభుత్వంతో మాట్లాడుతాము. ఆంధ్రరాష్ట్రాన్ని సత్వరమే ఏర్పరచవలసిన అవసరాన్ని గూర్చి నొక్కి చెప్పుతాము. ఇందులో మా శక్తివంచన లేకుండా కృషి చేస్తాము. కాబట్టి, మీరు మా కోర్కెను మన్నించి నిరశన వ్రతం విరమించండి. ప్రస్తుతం ప్రజలలో బయలుదేరిన నూతనోత్సాహాన్ని నూతన చైతన్యాన్ని సంఘటితపరచి, ఐక్యతను సాధించుటకు మీ శక్తిని వినియోగించండి. అప్పుడు ఆంధ్రరాష్ట్రం మీరు ఊహించినదానికంటె సత్వరంగా సులభంగా సునాయాసంగా సిద్ధిస్తుంది. అని మా దృఢ విశ్వాసము.

ఇట్లు:- మీ విశ్వాసపాత్రులు నీలం సంజీవరెడ్డి, కల్లూరి చంద్రమౌళి, బెజవాడ గోపాలరెడ్డి.

## ప్రాయోపవేశాన్ని విరమించండి

### కౌన్సిలు అధ్యక్షులు రామకృష్ణంరాజుగారి ప్రార్థన

మద్రాసు, సెప్టెంబరు 6: మద్రాసు లెజస్లేటివ్ కౌన్సిలు అధ్యక్షులు ఆర్. బి. రామకృష్ణం రాజు గారు స్వామీ సీతారాంకు ఈ విధంగా తంతి నిచ్చారు: "తాము ప్రాయోపవేశాన్ని విరమించ ప్రార్థించుచున్నాను. ప్రత్యేక ఆంధ్రరాష్ట్రంకన్న మీ ప్రాణానికి ఆంధ్రులు హెచ్చుగా విలువ ఇస్తున్నారు. మీ తపస్సుకు జేకిమంతా దద్దరిల్లింది. ఈ సమస్యను ఆలోచించే ప్రభుత్వాలకు వ్యవధి ఇవ్వండి. అవసరమైతే మళ్ళీ మీరు ప్రాయోపవేశానికి పూనుకోవచ్చు. మీరు ప్రాయోపవేశాన్ని విరమించి, మీ శిష్యులచేత విరమింపచేసి అమూల్య ప్రాణాలను కాపాడుకోండి."

### భారత ప్రధానికి కౌన్సిలుసభ్యుల విజ్ఞప్తి

మోతే నారాయణరావు, పసుమర్తి వీరభద్రస్వామి, మద్ది సుదర్శనం, కొల్లూరి వీరభద్రరావు, ఆత్మూరి గోవిందాచారి, అద్దెపల్లి గోపాల కృష్ణయ్యగారలు స్వామీ సీతారాం ప్రాయోపవేశ సందర్భంగా భారత ప్రధానమంత్రికి ఈ తంతినిచ్చారు.

"ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు అధీనంలో ఉన్న ప్రాంతాలతో ఆంధ్రరాష్ట్ర నిర్మాణం అక్టోబరు రెండోతేదీ ముందర సాధ్యమని మేము నమ్ముచున్నాము. ఆచార్య వినోబాభావే గారి మధ్యవర్తిత్వానికి వివాదాస్పద విషయాలన్నీ వదలి రాష్ట్రనిర్మాణానికి తగిన సన్నాహాలు చెయ్యవలసిందని ప్రార్థిస్తున్నాము. రాష్ట్రనిర్మాణానికి తనువర్పణ కైనా స్వామివారియొక్క వారిశిష్యులయొక్క అమూల్యమైన ప్రాణాలను రక్షించవలసిందిగా కోరుతున్నాము."

## భారత-ఆఫ్ఘన్ సంబంధాలు

(1 వ పేజీ తరువాయి)

స్యమైనాసరే, శుభ్రంగా పరిష్కరించగలం.

మేము స్వాతంత్ర్యాన్ని గూడా శాంతియుతమైన పద్ధతుల ద్వారా సాధించామన్న విషయంయొక్క ప్రసక్తిని మీరు తెచ్చారు. అంతేకాదు మామీద 150 సంవత్సరాలు పరిపాలన సాగించిన దేశంతో గూడా స్నేహంతో వుంటున్నాం. ఇంతవరదాకా మామెత్తిమీద మూర్ఖుని అధికారంచలాయించిన సామ్రాజ్యవాది పాలకునితోనే మేము స్నేహంతో మెల్గగల్గుతున్నామంటే, ఇక ఇతరులతో మేము స్నేహం నెరపగల్గడాన్ని గూర్చి వేరే చెప్ప నవసరంలేదు. మాకు ఎవరిపట్ల గాని, విరోధభావం లేదు.

ప్రపంచంలో అన్ని దేశాలతోను ఇండియా స్నేహసంబంధాలనువాంఛిస్తున్నది. ముఖ్యంగా మా ఇరుగుపొరుగు రాజ్యాలవారితో ఇది మరి ముఖ్యం. బ్రిటిషువాళ్లు ఈ దేశంలో వున్నప్పుడు ఇండియాకు దాని ఇరుగు పొరుగు రాజ్యాలకు మధ్య ఎట్టి సంబంధాలు గాని వుండేవిగావు. అంతకుపూర్వం ఈ సంబంధాలు బాగావుండేవి. ఇప్పుడు స్వాతంత్ర్యం రావడంతో ఆ తెరలు తొలగి, ఆగోడలుపడి, తిరిగి తప్పటి సంబంధాలు నెలకొన్నాయి.

ఇండో-ఆఫ్ఘన్ సంబంధాలను గూర్చి మాట్లాడుతూ పూర్వంలాగా వీరూ మాకూ వున్న పూర్వపు సరిహద్దులు మారిపోవడాన్ని గూర్చిన ప్రసక్తితెచ్చారు. అది నిజమే అయితే ఒక జాతికి, మరోజాతికి మధ్య వుండే సంబంధాలు పరిహద్దులమీద ఆధారపడి వుండవు. అవి ప్రాతిలు, కోత్తలు, అయిన అనేక విషయాలమీద ఆధారపడి వుంటాయి. మానసికమైన ప్రవృత్తులు ఈ సంబంధాలకు ప్రోత్సాహం ఇచ్చేవే అయినా, అవే సర్వం అని అనడానికి వీలులేదు. ఒకదేశం అవసరం ఇంకోదేశానికి ఎప్పుడూ వుంటుంది. ఆ అవసరాలమీద ఈ సంబంధాలు ఎక్కువగా ఆధారపడి వుంటాయి. ఈసంబంధాలు ఆయాదేశాలమధ్య ఎంత సంస్తుత్యమానంగా వుంటే, అంత బలం చేకూరుతుంది. ఇండియా ఆఫ్ఘనిస్తాన్‌లకు సంబంధించినంతవరకు ఈ సంబంధాలు ఆటుకంటవి. పరస్పర సహాయం, సహకారం వీటిమీద ఆధారపడి వున్నవి. ఈ రెండు దేశాలు, శాంతిని వాంఛించే దేశాలయి వుండటంవల్ల, యీ మన సంబంధాలవల్ల ప్రపంచంగూడా హితాన్ని పొందవచ్చు.

ఈ సభలో ఆఫ్ఘనిస్తాన్ ప్రధాని ప్రసంగిస్తూ ఇలా అన్నారు. "ప్రస్తుత సమయమున మనకు ఉమ్మడి సరిహద్దు లేనిమాట వాస్తవమే. కాని దీనికంటె ఎక్కువ ప్రయోజనకరమైనదీ, నానాటికీ మన పరస్పర హృదయానుబంధమును హెచ్చించేదీ మరొకటి కలదు. అది మన చిత్తశుద్ధి; మన పరస్పర సుహృద్భావము. ఇరుగుపొరుగు రాజ్యాలతో మిత్రభావమున వ్యవహరించడమే అనాదినుండి మా దేశ విధానమై వున్నది. ఈనాడుగూడ మా విదేశాంగ విధానమిదే. ఇకముందుగూడ ఇట్టి విధానమునే మేము అవలంబింప ఉద్దేశిస్తున్నాము. ఇతరుల హక్కులను మేము యెల్లప్పుడు గౌరవిస్తాము. ఇతరుల యెడల మాకు దురుద్దేశమేమీ లేదు. కాని మేము అచంచలంగా నిలిచి మా హక్కులను, మా సోదరుల హక్కులను రక్షిస్తాము."

## నెహ్రూయే స్వీకరిస్తాడు

(1 వ పేజీ తరువాయి)

ఎన్నుకోవాలి. ఇక రెండవ మార్గోపాయం ఏదనగా: ప్రస్తుతము ఉన్నటువంటి కాంగ్రెసు కార్యవర్గ సభ్యులందరును రాజీనామా నివ్వవలెననియు, వారు రాజీనామా నిచ్చిన అనంతరము పండిట్ నెహ్రూగారితో సంప్రతించి కాంగ్రెసు అధ్యక్షుడు క్రొత్త కార్యవర్గ సభ్యులను నియమించవలెననియు, అ. భా. కాం. కమిటీవారు, కాంగ్రెసు అధ్యక్షునకు ఆదేశం యివ్వవలెను. ఈ ఆదేశాను సారంగా క్రొత్త కాంగ్రెసు కార్యవర్గము ఏర్పాటు కావలెను.

పైజెప్పిన రెండు పద్ధతులున్ను కాంగ్రెసు అధ్యక్షునకు పండిట్ నెహ్రూకు సమాధానకరంగా వుంటాయని ఊహింపబడుతోంది. మొదటి పద్ధతిని ఆచార్య జుగల్ కిశోరుగారు సూచించారు. కాని యిది పండిట్ నెహ్రూగారికి సమ్మతంగా లేదు. రెండోపద్ధతి నెహ్రూగారికి రుచించినదో లేదో తెలియదు. కాని ఇది కాంగ్రెసు అధ్యక్షునకు మాత్రము అంగీకారయోగ్యంగా లేదు. కాంగ్రెసు కార్యవర్గం యావత్తూ ముందుగా రాజీనామా యివ్వవలెననే యెడల, కార్యవర్గంలో చేరిన కాంగ్రెసు అధ్యక్షుడగు తానుకూడా రాజీనామా యివ్వాలి. ఈ పద్ధతి టాండనుగారికి కిందటి కార్యవర్గ సమావేశంలోనే సూచింపబడెను. అప్పుడే వారిఅయిష్టమును తెలియజేశారు. తన కార్యవర్గ సభ్యులచేత రాజీనామా యిప్పించడంకంటు, తానే కాంగ్రెసు అధ్యక్షపదవినుండి తొలగిపోయి, కాంగ్రెసు వ్యవహార భారంఅంతా నెహ్రూగారికి ఒప్పగించవలెననే అభిప్రాయంతో టాండన్‌గారు ఉన్నట్లుగా తెలుస్తోంది. అటువంటి పద్ధతికి పండిట్ నెహ్రూగారు అయిష్టంగా లేదని తెలుస్తోంది. ఎన్నికలు అయ్యేవరకు తాను, కాంగ్రెసు అధ్యక్షపదవిని గ్రహించడానికి అభ్యంతరం చెప్పరు.

## విశాఖ జిల్లా కాంగ్రెసు అధ్యక్షుడు

### గొర్రిపాటి బుచ్చి అప్పారావు గారి ఎన్నిక

విజయనగరం, సెప్టెంబరు 6: ఈ రోజు ఇక్కడ జరిగిన విశాఖజిల్లా కాంగ్రెసు సర్వసభ్య సమావేశంలో విశాఖ జిల్లాబోర్డు అధ్యక్షుడయిన గొర్రిపాటి బుచ్చి అప్పారావుగారు జిల్లా కాంగ్రెసు అధ్యక్షుడుగా ఏకగ్రీవంగా ఎన్నికైనారు. సమావేశానికి రాష్ట్ర కాంగ్రెసు ఉపాధ్యక్షుడు పసుమర్తి వీరభద్రస్వామి ఎమ్. ఎల్. సి. గారు అధ్యక్షత వహించారు. పూసపాటి మాధవవర్మగారు ఉపాధ్యక్షుడుగానూ, మిస్సుల సూర్యనారాయణ మూర్తిగారు ప్రధాన కార్యదర్శిగానూ, పసుమర్తి వెంకట సుబ్బారావు, బొల్లి సత్యనారాయణ గార్లు సహాయ కార్యదర్శులుగానూ ఏకగ్రీవంగా ఎన్నికైనారు.

సమావేశం మరి పదిమంది కార్యవర్గ సభ్యులను ఎన్నుకొనుటకూ, ఎన్నికల సంఘం, అర్హతా సంఘాలను ఎన్నుకొనుటకూ కూడా ప్రత్యేకంగా సమావేశ పరచినా, ఈ అంశాలు పరిష్కరించకుండానే సమావేశం వాయిదా వేయబడింది. సర్వసభ్య సమావేశం నియమిత కార్యక్రమం నెరవేర్చకుండా యీ విధంగా వాయిదా వేయడం కొందరు సభ్యులకు అసంతృప్తిని కలిగించింది. (స్వ. వి.)

### తూర్పు కృష్ణాజిల్లా కాంగ్రెసు కార్యవర్గ ఎన్నికలు

బందరు, సెప్టెంబరు 4: ఈజిల్లా కాంగ్రెసు కార్యవర్గానికి అధ్యక్షుడుగా ఎర్నేని వెంకటేశ్వర రావుగారు ఎన్నికైనారు. ఎన్నికలు పూర్వ అధ్యక్షుడు ఈడుపుగంటి లింగయ్యగారి అధ్యక్షతను జరిగాయి. సభలో 65 మంది పాల్గొన్నారు. ఉపాధ్యక్షుడుగా ఎన్నికైన పేటేటి సుబ్బారావుగారు, నూతన అధ్యక్షుడు సభకురాని కారణాన, మిగతా ఎన్నికలు జరిపించారు. ప్రధాన కార్యదర్శిగా విస్సకోట వెంకటస్వామినాయుడు, సహాయ కార్యదర్శిగా చంద్ర అంజయ్య, కార్యనిర్వాహక వర్గ సభ్యులుగా సిద్ధినేని సుబ్బారావు, కమ్మెల అంకయ్య, మండవ నాగభూషయ్య, యార్లగడ్డ వెంకటకృష్ణారావు, ప్రతింసు నాగేశ్వరరావు, సమ్మెట అక్కయ్య నాయుడు, అబ్దుల్ గఫూర్ సాహెబు, ఎర్రంశెట్టి కృష్ణమూర్తి, వల్లూరు పల్లి బుల్లెయ్య, శిరిపురపు సత్యనారాయణ, మాగంటి అంకినీడు, ఈడుపుగంటి లింగయ్య, నంబూరి వెంకట్రామరాజు, వడ్లాని రమణయ్య, గుడివాడ రామచంద్రరావు గార్లు (మొత్తం 15 మంది) ఎన్నికైనారు.

ఎలక్షన్ ట్రిబ్యునల్ సభ్యులుగా వేమూరి నారాయణమూర్తి, సమ్మెట నారాయణరావు, మండవ శ్రీరామమూర్తిగార్లు, క్రెడెన్షియల్స్ కమిటీ సభ్యులుగా వల్లమూడి బుల్లి ఆదినారాయణ, దూలం అయ్యప్ప, అడపాల వెంకట్రామయ్యగార్లు ఎన్నికైనారు. (స్వ. వి.)

## కాంగ్రెస్ కార్యవర్గ సమావేశం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 6: కాంగ్రెస్ కార్యవర్గం నేటి సాయంత్రం 4-30 గంటలకు టాండన్‌గారి అధ్యక్షతక్రింద సమావేశమైంది. నెహ్రూ, ఆజాద్‌లు హాజరుకాలేదు. నేటిఉదయంటాండన్ మౌలానా ఆజాద్‌తో సంభాషించారు.

## ఆహారధాన్యాల సప్లయి వెంటనే జరగాలి

### కేంద్ర ప్రభుత్వానికి రాష్ట్ర ప్రభుత్వం అభ్యర్థన

మద్రాసు, సెప్టెంబరు 6: మదరాసు రాష్ట్రంలో ప్రస్తుత ఆహార నిలవల మొత్తం చాలా తక్కువగా దాదాపు నెల రోజులకు సరిపోగల వరకు 90 వేల టన్నులు మాత్రమే ఉంది. ధాన్య సేకరణ అతిస్వల్ప మొత్తానికి రానురాను తగ్గిపోతున్నది. మదరాసు రాష్ట్రానికి కేంద్ర ప్రభుత్వం వాగ్దానం చేసిన మాసవారీ కోటాలో జాప్యం జరుగుతుండటం యిప్పటికి 80 వేల టన్నుల బియ్యము కేంద్ర ప్రభుత్వం పంపవలసిన బాకీ యున్నది. ఈ బాకీ ధాన్యాన్ని కేంద్ర ప్రభుత్వం వెంటనే పంపవలసినదని యీ సెప్టెంబరునెల గడు నెల అయియున్నదని ధాన్యంసప్లయి తొందరగా అందని పక్షంలో రాష్ట్ర ప్రభుత్వము కష్టపడవలసి యుండునని మదరాసు ప్రభుత్వంవారు ఇండియా ప్రభుత్వానికి రెండు రోజుల క్రితం ఒక జరూరు తంతిని పంపారని తెలుస్తోంది.

## సింధు ముస్లిం లీగు ఉపాధ్యక్షునిపై హత్యా ప్రయత్నము

### పాకిస్తాన్ ప్రతినిధి ప్రకటన

నవాబ్‌షా (సింధు), సెప్టెంబరు 6: సింధు ముస్లింలీగు ఉపాధ్యక్షుడగు సయ్యద్ ఖైయిర్‌షా ఎమ్. ఎల్. ఏ. ను హత్యచేయడానికి లీగుప్రతిపక్షులు గతవారం విఫల ప్రయత్నం గావించారని తెలుస్తున్నది. అతని హత్యచేయదలచిన రోజున అతడు నవాబ్‌షాలో లేకపోవుటవల్ల ఈ ప్రయత్నం విఫలమైంది.

## స్వర్ణోత్సవ కానుక

ప్రత్యేక సూచనల ప్రకారం తయారు చేయబడినవి.

పరిటి 5 సం.లు గ్యారంటి

| | | |
|---|---|---|
| నం. 1 | | సైజు 10½" |
| 5 జాయుల్సు క్రోం రు. 32 | రోల్డుగోల్డు రు. 35 | |
| 7 ,, ,, ,, 37 | ,, ,, 40 | |
| 15 ,, ,, ,, 46 | ,, ,, 48 | |
| నం. 2 | | సైజు 11" |
| 5 జాయుల్సు క్రోం రు. 22 | సుపీరియర్ రు. 24 | |
| రేడియంతో ,, 24 | సెంటర్ సెకండ్ 25 | |
| వాటర్ ప్రూఫ్ 15 జాయుల్సు రు. 60 | | |
| నం. 3 | | సైజు 8 3/4 |
| 5 జాయుల్సు క్రోం రు. 32 | రోల్డుగోల్డు రు. 34 | |
| 7 ,, ,, ,, 34 | ,, ,, 36 | |
| 15 ,, ,, ,, 48 | ,, ,, 56 | |
| నం. 4 | | సైజు 6 3/4 |
| 5 జాయుల్సు క్రోం రు. 24 | సుపీరియర్ రు. 27 | |
| 5 ,, రోల్డుగోల్డు రు. 30 | ,, 32 | |
| 15 ,, క్రోం రు. 45 | ,, ,, 48 | |
| ఇంగ్లీష్ టైంపీసు రు. 24 | ,, రు. 25 | |
| పాకెట్ వాచి ,, 12 | ,, రు. 15 | |

ఏ రెండు గడియారాలు ఆర్డరుకైనా ఒక రెస్టెండ్ గోల్డుపిన్ ఉచితము.

ప్యాకింగు పోస్టేజి, అమ్మకం పన్ను ఉచితము

CARONA WATCH CO.,
Post Box No. 6729, Calcutta- 7.


## వేలము ప్రచురణ

గుంటూరు జిల్లా బోర్డుకు చెందిన యం. డి. జి. 751 నెంబరు గల ఒక లారీని 1951 సం॥ సెప్టెంబరు 20 వ తేదీన సాయంత్రము 3 గంటలకు జిల్లాబోర్డు ఆఫీసు ఆవరణలో బహిరంగ వేలములో విక్రయించబడును. అమ్మకపు షరతులను జిల్లాబోర్డు ఆఫీసు సెక్రటరీగారివద్దనుండి ఎనిమిదణాలు రొక్కపూర్వకముగా గాని లేపాలా బిళ్ళలరూపముగా గాని చెల్లించి పొందవచ్చును. పై చెప్పబడిన లారీని పరీక్షింపదలచినయెడల అది జిల్లాబోర్డు ఆఫీసు ఆవరణలో నే యుంచియున్నది.

(సం) ఎస్. వెంకటేశ్వర్లు,
ప్రెసిడెంటు.

జిల్లాబోర్డు ఆఫీసు గుంటూరు. 1-9-51.


## శుద్ధమైన వున్ని కంబళి

రు 5/- లు మాత్రమే.

మా క్రొత్తస్కీము వ్యాపింపజేయటానికి, ఇటలీలో తయారైన శుద్ధమైన వున్ని కంబళ్లను పంచుతున్నాము. స్టాకు మితంగా వున్నది. అందువల్ల ఒక్కొకరికి రెండు కంబళ్ల కంటె యెక్కువ యివ్వబడవు.

General Novelty Stores,
Post Box No. 1517/C Delhi.

"బ్రాహ్మీ టేబ్లెట్సు"

నత్తి, మూగ, మూర్ఛ, హీనస్వరం, మూర్ఛ, హిస్టీరియా, ... నిద్రలేమి, వగైరా శిరోరోగములకు, ... జ్ఞాపకశక్తి, బుద్ధిబలమునొసగును విద్యార్థి, వక్తక, ఉద్యోగులకు అమృతోపమానమైనది. 80 టేబ్లెట్సు, పోస్టుఖర్చులుపహా రు. 5-0-0. లలితా మెడికల్ స్టోర్సు, రాజమండ్రి.

## హెచ్చరిక

మంచి సరుకుల సంకోచంలేని కొందరు, ప్రత్యేకించి పాలఘాటు వైపునుంచి ఇరానీమాట్ హింగ్ సప్లయింగ్ కంపెనీ తరఫున బి.యస్. చిదంబరంపిళ్లె అనువారు, మా ఏజంట్లమని లేక మా కాన్వాసర్లమని నటించుచూ మా L. G. ప్యాకెట్ల మాదిరి ప్యాకెట్లలో నాసిరకపు ఇంగువను అది మా ఇంగువే అని చెప్పుచూ నేరుగ అమ్ముచు లేక ఇతర విధముల సప్లయి చేయుచు వర్తకులను, ప్రజలను మోసబుచ్చుచున్నట్లు మాకు తెలియవచ్చినది. ఇట్లు జరుగుచున్నట్లు విజయవాడలోను, కొన్ని ఇతర పట్టణములలోను కని పెట్టబడినది.

ఇట్టి మోసగాండ్రతో వ్యవహరించవలదని వర్తకులకు, ప్రజలకు ఇందుమూలముగ హెచ్చరించడమైనది. శ్రీ యమ్. ఆర్. వెంకటాచలం నాయుడు, శ్రీ యస్. గోపాల్ చెట్టి, శ్రీ యస్. రామారావుగార్లు మా కాన్వాసర్లు. వీరు మాత్రమే మా తరఫున ఆర్డర్లు బుక్ చేయుటకు అధికారం పొందియున్నారు. ఆర్డరు చేయబడిన సరకులు ఎల్లప్పుడును మాచే మద్రాసులోని మా ఆఫీసునుంచి పంపబడును గాని మా కాన్వాసర్లచే ఎట్టి స్టాకులును సప్లయి చేయబడవు. మా యల్. జి. ఇంగువకు ఆర్డర్లు పైన పేర్కొనిన మా కాన్వాసర్లకు మాత్రమే ఇవ్వవలసినదనియు, లేదా మాకు పంపవలసినదనియు, సప్లయిలు మా ఆఫీసునుంచే వచ్చుచున్నట్లు గమనింపవలసినదనియు వర్తకులను, డీలర్లను కోరుచున్నాము.

లాల్ జి గోధు అండు కో,
8, పెరుమాళ్ మొదలి వీధి, సాహుకారుపేట, మద్రాసు.

ఈ చిన్నచేతులు ఆటలోమునిగియున్నవి.అయితే...

...ఆటలోమునిగియున్న చేతులుకూడ మలినమగును!

మలినమైన చేతులలో మట్టిగియున్న అపాయమున్నది!

మలినములోని అగోచరమైన క్రిములవలన!

తరచు లైఫ్‌బాయ్‌తో కడుగండి

లైఫ్‌బాయ్ సబ్బు

మలినములోని క్రిములనుండి మిమ్ములను రక్షించును!

L. 151-X52 TL


## జమీందారీలరద్దు సవరణబిల్లు

### మదరాసు అసెంబ్లీ ఆమోదం

మంగళవారం మధ్యాహ్నంఅసెంబ్లీ సమావేశమైనప్పుడు డిప్యూటీ స్పీకరు శ్రీమతి అమ్మన్నరాజాగారు అధ్యక్షత వహించారు.

శ్రీ వెంకటగిరిరాజాగారు మాటలాడుతూ ఈబిల్లు ప్రధాన శాసన మూలసూత్రములనే మారుస్తోం దన్నారు. జమీరాా ఎస్టేట్లను అండర్ టెన్యూర్ టెన్యూరు. ఎస్టేట్లు ఒకటేననుట సక్రమం గా దన్నారు.

శ్రీ విశ్వనాథంగారు మాటలాడుతూ జమీందారు అండర్ టెన్యూరు ఎస్టేటు ఈనాందారు పరిహారం పొందవలసిందే నన్నారు. తక్కువో ఎక్కువో జమీందార్లు ఒక మొత్తంతో తృప్తిపడ్డారు. ఇప్పుడువచ్చి ప్రభుత్వం అండర్ టెన్యూర్ ఎస్టేట్లకు జమీందార్లకు ఇచ్చే పరిహారం మొత్తముక్రింద చేర్చుతామంటున్నారు. ఈనాందార్లకు 5 కోట్లు పరిహారం వాగ్దానం చేశారు. అయితే ఆమాటను శాసనంలో చేర్చలేదు. జమీందార్లకు12కోట్లు, ఈనాందార్లకు 5 కోట్లుఇస్తూవున్నట్లుఅండర్ టెన్యూర్ ఎస్టేటులకు కూడా న్యాయమైన పరిహారం ఇవ్వాలి. వారిని 12 కోట్లలోనూ చేర్చకూడదు 5 కోట్లలోను చేర్చకూడదు. వారికి ప్రత్యేకంగా ఒక మొత్తం నిర్ణయించాలి. మొత్తం తేల్చుట ఇప్పుడు సాధ్యం కాని ఎడల, బిల్లును సెలెక్టు కమిటీకి నివేదించుట న్యాయమన్నారు.

శ్రీబద్దెపూడి వెంకటనారాయణరెడ్డి: జమీందార్లకు నిర్ణయించిన పరిహారం మొత్తము 12 కోట్లు సెలెక్టు కమిటీలో గాని అసెంబ్లీలో గాని నిర్ణయమైనదిగాదు. ఆ నిర్ణయం అధిష్ఠానవర్గం ఆదేశం ప్రకారం జరిగింది. ఈనాములకు ప్రత్యేకంగా పరిహారం నిర్ణయించగానే అండర్ టెన్యూర్ ఎస్టేట్లవారుకూడా ఆందోళన చేయ ప్రారంభించారు. అండర్ టెన్యూర్ ఎస్టేట్లను ప్రత్యేకంగా పరిగణించదలచుకుంటే అప్పుడే జరిగివుండేది. అండర్ టెన్యూర్ ఎస్టేట్లకు జమీందార్లకు ఇచ్చే పరిహారం మొత్తమునుండే ఇచ్చుట న్యాయమన్నారు.

### రివిన్యూమంత్రి సమాధానం

చర్చకు సమాధానం ఇస్తూ మంత్రిగారిల్లా అన్నారు: ప్రభుత్వం జమీందార్లకు అన్యాయం చేస్తోందని విమర్శించారు. ఒరిజనల్ బిల్లులో లేనిసౌకర్యాలు జమీందార్లకుచేశాం, మంచిని మంచిగా గుర్తించాలి. జమీందార్లలో అంతర్భాగమైన అండర్ టెన్యూర్ ఎస్టేట్లను వదిలివేయమనుట న్యాయమనుకోను. జమీందారీలు, అండర్ టెన్యూర్ ఎస్టేట్లు ఒకే తరగతికి చెందుతాయి. జమీందార్లతోపాటు పరిహారలాభాలను పంచుకొనుటకు వారికి అధికారం వుంది. వెంకటగిరి రాజాగారు అన్నం అడిగితే సున్నం యిచ్చామన్నారు. 12 కోట్లు చిత్తుకాగితాలా? 12 కోట్లు సాధించిన తరువాత కూడా రొందుకో ఈ కింద తెలియకుండా వుంది. విశ్వనాథంగారు అండర్ టెన్యూర్ ఎస్టేట్లగూర్చిన వివరాలు అడిగారు. ప్రస్తుతం వివరాలు నావద్ద లేవు. సూత్రమును అంగీకరిస్తే వివరాలను తయారు చేసుకోవచ్చును. 12 కోట్లలో సుమారు 25 లక్షలను అండర్ ఎస్టేట్లు పంచుకుంటారు. అదేమంత పెద్ద మొత్తం కాదని అన్నారు.

బిల్లు తృతీయ పఠనంలో శ్రీ విశ్వనాథంగారు మాట్లాడుతూ మంత్రిగారు నేను అడిగిన అంకెలు లేవన్నారు. మెజారిటీవుంది. బిల్లు శాసనం అవుతుంది. ఈ బిల్లువల్ల కొంతమంది పాపర్లు అవుతారు. రాష్ట్రంలో అండర్ టెన్యూరు ఎస్టేట్లెన్ని వున్నాయో కూడా మంత్రిగారు చెప్పే స్థితిలో లేరు. అంతా అయోమయంగా వుంది. ప్రభుత్వం వశపరచుకున్న తరువాత బకాయిలను వసూలు చేయలేకపోతున్నారు. మంత్రిగారు చెప్పిన అంకెలు శుద్ధ తప్పు.

శ్రీ నటేశ చెట్టియార్ బిల్లుకు తీవ్ర అసమ్మతిని తెలిపారు.

మంత్రిగారు సమాధానం యిచ్చిన తరువాత సభవారు బిల్లును శాసనంగా ఆమోదించారు.

### యునైటెడ్ డెమోక్రెటిక్ ఫ్రంటు

మదరాసు, సెప్టెంబరు 4: నేడు అసెంబ్లీలో ప్రశ్నోత్తరములుకాగానే శ్రీ విశ్వనాథంగారు యునైటెడ్ డెమోక్రెటిక్ ఫ్రంటును అసెంబ్లీలో ప్రధాన ప్రతిపక్షముగఎంచి స్థానాలు కేటాయించ గోరినామనియూ ఎప్పుడు స్థానములను కేటాయించెదరో తెలుసుకో గోరారు.

స్థానాల నిర్ణయం ఒక్కరాత్రిలో జరగదు. అందుకు కొంతవ్యవధి వుండాలని అంటూ స్పీకరు ఈ సారి సమావేశంలో ప్రత్యేక స్థానాలు ఇచ్చెదమని స్పీకరు తెలిపాలిపారు.

ముస్లింలీగు తరఫున రజాఖాన్ లేచి ముస్లింలీగు సభ్యత్వం ఒకటి పెరిగి 19 అయిందని అందువలన మార్పు ఏమి చేయకుండా స్థానాలను యధాతథంగా వుంచాలన్నారు.

సభానాయకుడు గోపాలరెడ్డిగారు సమావేశం ఆరంభంలో స్థానాలు నిర్ణయించుట మంచిదని సూచించారు.

### విజయవాడలో కి. మ. ప్రజా పార్టీ కార్యాలయం

ఆంధ్ర కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీ ఆఫీసు బందరు రోడ్డుపైనున్న శ్రీ కోకా విశ్వనాథం మేడ (20/6) లో నైన ప్రారంభించారు.

## పన్ను బిల్లులు: కవున్సిల్ అధికారాలు

### అసెంబ్లీ స్పీకరు రూలింగ్

మదరాసు, సెప్టెంబరు 4: పన్ను బిల్లును అసెంబ్లీలో అన్ని దశలలో అంగీకరించక పూర్వం కవున్సిల్ లో ప్రవేశ పెట్టరాదని నేడు అసెంబ్లీలో స్పీకరు రూలింగు ఇచ్చారు.

నిన్న మదరాసు రైతువారి అదనపు శిస్తు విధింపు బిల్లుపై జరిగిన చర్చలో శ్రీ తెన్నేటి విశ్వనాథంగారు పన్ను బిల్లుల విషయంలో జాయింట్ సెలెక్టు కమిటీకి నివేదించాలని ప్రతిపాదన చేయుట క్రమంగాదని ఆక్షేపణ తెలిపారు.

దానిమీద స్పీకరు నేడు అసెంబ్లీలో శ్రీ విశ్వనాథంగారి ఆక్షేపణను సమర్థిస్తూ పైరూలింగు ఇచ్చారు.

రూలింగు ఇస్తూ ఇట్లా చెప్పారు: ఇండియాలో శాసన సభల నిర్మాణం చాలా వరకు ఇంగ్లండు పార్లమెంటును ఆదర్శంగా పెట్టుకొని చేశారు. కామన్సు చరిత్రచూస్తే ఆర్థిక విషయాలలో రాజు, లార్డ్సు సభలపై తమ అధికారమును స్థిరపరచుకొను పోరాటంగా నే కనిపిస్తుంది. ఈ నాటికీ ఆ వాక్కును స్థిరపరచుకొనుటకు రాజుగారి ప్రసంగం చర్చించే ముందు "ఆవుట్ లారీస్ బిలు" అనే దానిని చర్చిస్తారు. ఈసందర్భంలో కామన్సు పన్ను బిల్లులను జాయంటు కమిటీకి అంగీకరిస్తారనుకోను.

పన్ను బిల్లుల సందర్భమున అనుసరించవలసిన విధానము రాజ్యాంగం 198 (1) నుండి (5) వరకు వుంది. దానిని బట్టి పన్ను బిల్లుల విషయంలో కవున్సిల్ కు అసెంబ్లీమీద అధికారం పూర్తిగ లేనట్లు తెలుస్తుంది. అసెంబ్లీ రూలు 116 ననుసరించి జాయంటు సెలెక్టు కమిటీలో అసెంబ్లీ కవున్సిల్ సభ్యులవంతు 2 : 1 గ వుండాలనివుంది. అసెంబ్లీ 12 గురిని, కౌన్సిల్ 6 గురిని నియమించారను కుందాం. ఒక క్లాజు విషయంలో 7 గురు అసెంబ్లీ సభ్యులు ఒక అభిప్రాయంతో వున్నారనుకుందాం. కౌన్సిల్ సభ్యులు 6 గురు చేరి మిగిలిన 5 గురి సభ్యులతో కలిసి క్లాజును ఆమోదిస్తారు. బిల్లు అసెంబ్లీకి మరల వచ్చినప్పుడు నిరాకరించే వాక్కు, అంగీకరించేవాక్కు వున్నా కౌన్సిల్ ప్రభావం తప్పకుండా వుంటుంది. పన్ను బిల్లును కౌన్సిల్లో ప్రవేశపెట్టలేదంటారు. జాయింటు సెలెక్టు కమిటీ నియామక ప్రతిపాదన వచ్చినప్పుడు కౌన్సిల్ బిల్లును సమగ్రంగా చర్చిస్తారు. చర్చించను ఎవరూ నిరాకరించలేరు. కనుక, పన్ను బిల్లు అసెంబ్లీలో అన్ని దశల్లో అంగీకరించక పూర్వం ఇటువంటి ప్రతిపాదనను కౌన్సిల్ ముందు పెట్టరాదని తీర్మానిస్తూ వున్నారు.

### ప్రభాకర శాస్త్రిగారి వర్ధంతిసభ

మద్రాసు, సెప్టెంబరు 2: నేటి సాయంకాలం కిన్నెర కార్యాలయంలో స్వర్గీయ వేటూరి ప్రభాకర శాస్త్రిగారి వర్ధంతిసభ మల్లంపల్లి సోమశేఖర శర్మగారి అధ్యక్షతను జరిగింది. శాసనాలు మొదలు జానపదాలవరకు పరిశోధించిన శాస్త్రిగారు ఆంధ్ర సాహిత్యానికి చేసిన సేవను సోమశేఖర శర్మగారు ప్రస్తుతించారు. బులుసు వెంకటరమణయ్య, విద్వాన్ విశ్వం, రామచంద్ర, తిమ్మావఝ్ఝల కోదండరామయ్య, పందిరి మల్లికార్జున రావుగార్లు కూడా శాస్త్రిగారి సాహితీసేవను వివరించారు.

2 వ తరగతి రైలుపెట్టెలో వుంచే దిండ్లను కత్తిరించి దొంగిలించిన నేరానికి కుశేంద్రదాస్ (35) అను వతనిని సెంట్రల్ స్టేషన్ పోలీసు అధికారి నారాయణస్వామి నాయుడుగారు అరెస్టుచేశారు.

### మద్రాసువద్ద కుష్ఠురోగ చికిత్సాలయం

మద్రాసు, సెప్టెంబరు 4: తాంబరానికి 10 మైళ్ల దూరంలో కొండం బాకంవద్ద కుష్ఠురోగ చికిత్సాలయం నిర్మించాలనే ఒక ఆలోచన కార్పొరేషన్ వారికి వున్నది. ఇందుకుగాను అలగప్ప చెట్టియారుగారు కొన్ని ఎకరాల భూమిని కూడా విరాళంగా యిచ్చివున్నారు. కేంద్ర ప్రభుత్వం డిఫెన్స్ శాఖవారు యీ చికిత్సాలయం నిర్మించబోయే స్థలం ఐ. ఏ. ఎఫ్. వారి స్థావరానికి అతిసమీపంగా వున్నందున, వారి సిబ్బందికి ఆరోగ్య భంగం కలిగించవచ్చునని కారణంగా యిక్కడ చికిత్సాలయ నిర్మాణానికి తమ ప్రాతికూల్యాన్ని వెల్లడించారు. అంతిమంగా స్థలనిర్ణయం చేసేటప్పుడు తమ అనుమతి పొందవలసిందని కూడా సూచించారు.

### చిత్తూరుకు పంపింగ్ స్కీం

మదరాసు, సెప్టెంబరు 4: వ్యవసాయమంత్రి శ్రీ ఎ. బి. షెట్టి నేడు అసెంబ్లీలో రివర్ పంపింగ్ స్కీములకు సంబంధించిన ప్రశ్నకు జవాబు ఇస్తూ, చిత్తూరుజిల్లాలో రివర్ పంపింగ్ స్కీమును గూర్చి వ్యవసాయ శాఖ డైరెక్టరు పరిశీలిస్తూ వున్నారని చెప్పారు.

### విజయవాడలో శ్మశానం ఆక్రమణ

మదరాసు, సెప్టెంబరు 4: కృష్ణలంక ఆక్రమణ ఆక్షేపణీయమే అయినా ఆక్రమించినవారు బీదవారైనందున తరిమివేసే ముందు వారికి నివేశన స్థలాలను చూపించాలని ప్రభుత్వం నిశ్చయించిందని రెవిన్యూమంత్రి నేడు అసెంబ్లీలో శ్రీకాశేశ్వరరావు గారికి సమాధానం ఇచ్చారు.

## మినాంబూర్ లో పోలీసు కాల్పులు

### న్యాయవిచారణ జరగాలనికోరిక అసెంబ్లీలో ప్రశ్నల పరంపర

మదరాసు, సెప్టెంబరు 3: ఆర్థిక మంత్రి శ్రీ గోపాలరెడ్డిగారు నేడు అసెంబ్లీలో మినాంబూర్ వద్ద ఇటీవల జరిగిన పోలీసు కాల్పులు గురించిన వివరాలు తెలియ జేశారు. దీని ఫలితంగా 9 మంది మరణించారు. పలువురు గాయపడ్డారు.

అబ్దుల్ మజీద్ గారి అవ్యవధిప్రశ్నకు మంత్రిగారు సమాధాన మిచ్చారు: మినాంబూర్ కు అంటియున్న పలియాంపట్టు, కవరచేరి గ్రామాల్లో రు. 30 వేల దొంగసొత్తు మాటుపరచబడిందని తెలిసి ఆగస్టు 30 తేదీన కష్టమ్సు అధికార్లు జింజీ జుడిషియల్ సబ్ మాజిస్ట్రేటు నుండి సోదా వారంట్లు పొంది దాడి చేశారు. కష్టమ్సు పార్టీ ఉదయం 8-0 లకు కవరచేరి వెళ్ళి కొంత దొంగసొత్తును స్వాధీనం చేసుకున్నారు. గం 11-0 లకు పార్టీ పలియాంపట్టు వెళ్ళి మూడు ఇళ్లు సోదా చేశారు. అక్కడ ఏమీ దొంగ వస్తువులు కనబడలేదు. కాని ప్రక్క ఇంటిలో కొంత సరుకు దాచినట్లు తెలిసి కష్టమ్సు పార్టీ వారు భాషాసాహెబ్ ఇంటిని సోదా చేయుటకు అనుమతికోరారు. కష్టమ్సు అధికార్లు 2-30 గంటలకు ఆ ఇంటి మూడు వైపుల సాయుధ పోలీసు దళమును వుంచారు. ఆ సమయానికి గ్రామస్థులు 200 మంది చేరి వారిని అటకాయించటం ప్రారంభించారు. 3-15 నిమిషాలకు సోదా చేయుటకు అనుమతి అందింది. వాళ్లు అటకాయించటం మానలేదు. కష్టమ్సు డిప్యూటీ సూపరింటెండెంట్లు ఇద్దరు వెంటనే జింజీ వెళ్లి సబ్ మాజిస్ట్రేటు, సర్కిల్ ఇన్ స్పెక్టరు, కొందరు స్థానిక పోలీసులను తీసుకొని వచ్చారు. 4-45 లకు సోదా ప్రారంభమైంది.

అటకాయించవద్దని సబ్ మాజిస్ట్రేటు హెచ్చరించారు. ఇంట్లో ప్రవేశిస్తూ వుండగా బ్లాంక్ కార్డులను తగులబెట్టు తున్నారు. ఇంటి బయట ఆవరణలో చేరిన గ్రామస్థులు రాళ్లు రువ్వటం ప్రారంభించి ఇంటిలోనికి త్రోసుకొని వచ్చారు. ఒక కష్టమ్సు ఇన్ స్పెక్టరుకు తలమీద దెబ్బతగిలింది. మరొకరికి వీపుమీదతగిలి క్రిందపడ్డాడు. పడిపడటంతోటే గ్రామస్థులు ఆయన తుపాకీని గుంజుకొని ఒకసారి కాల్చారు. అది సబ్ మాజిస్ట్రేటు ప్రక్కగా పోయింది. పరిస్థితి చేయిదాటి పోతున్నందున సబ్ మాజిస్ట్రేటు కాల్చుటకు వుత్తర్వు ఇవ్వక తప్పిందిగాదు. పార్టీని తిరోగమించమనికూడా వుత్తర్వు ఇచ్చారు.

సాయుధ పోలీసుదళం 30 వరసలు కాల్చింది. ముగ్గురు వెంటనే చచ్చిపోయారు. రాళ్లు రువ్వటవల్ల ఒక కష్టమ్సు పోలీసు డిప్యూటీ సూపరింటెండెంటు, ఒక ఇన్ స్పెక్టరు కష్టమ్సు సౌకర్లు ఇద్దరు జమాదార్, యన్. సి. ఒలకు స్వల్పగాయాలు తగిలాయి. చచ్చినవారిని వదిలివేసి, గ్రామస్థులు గాయపడినవారిని జింజీ తీసుకొని వెళ్లారు. తక్షణ విచారణవల్ల 7 గురు గ్రామంలోనూ, ఇద్దరు జింజీకి చేర్చిన తరువాత మరణించినట్లు తేలింది. మొత్తం 9 మంది చచ్చారు. 16 గురు గ్రామస్థులు గాయపడ్డారు.

సంఘటన వర్తమానం చేరగానే కలెక్టరు సబ్ కలెక్టరు వి. డి. యస్. పిలను జింజీవెళ్లి వైద్య సహాయమునకు ఏర్పాటుచేయ గోరారు. జింజీ మెడికల్ అఫీసరు గ్రామాంతరంలో వున్నందున విల్లుపురం, కడలూరు నుండి వైద్య సహాయం ఉరికించవలసివచ్చింది. వైద్య సహాయం 31 తేదీ ఉదయం 9-0 లకు చేరింది. కలెక్టరు, డి. యస్. పి. సంఘటన జరిగిన చోటుకువచ్చి విచారణ చేస్తూ వున్నారు. ఆ పరిస్థితిలో ఆత్మరక్షణ నిమిత్తం సబ్ మాజిస్ట్రేటు కాల్పులకు వుత్తర్వు ఇవ్వక గత్యంతరము లేదని కలెక్టరు తృప్తిపడ్డారు.

అబ్దుల్ మజీద్: మంత్రిగారి ప్రకటన బట్టి పోలీసులు హద్దు మీరినట్లు ఉన్నందున బహిరంగ విచారణ జరిపించుట న్యాయంకాదా?

గోపాలరెడ్డి: ప్రభుత్వంవారు ఈ విషయాన్ని పరిశీలిస్తూ వున్నారు.

రజాఖాన్ ప్రశ్నకు సమాధానం ఇస్తూ వైద్య సహాయం కొంత ఆలస్యంగా అందిందని మంత్రిగారు అంగీకరించారు.

సలాం: సంఘటన జరిగిన చోటకు ప్రజల్లో ధైర్యం చేకూర్చుటకు మంత్రులెందుకు వెళ్లలేదు.

గోపాలరెడ్డి: అసెంబ్లీపని వత్తిడిలో వున్నాం.

అలీషేర్ ప్రశ్నకు సమాధానంగా న్యాయ విచారణ జరుపుటగూర్చి ఇప్పుడిప్పుడే ఏమీ చెప్పలేమని మంత్రిగారన్నారు.

### వాణిజ్య పంటలపన్నువల్ల ఆదాయం

మదరాసు, సెప్టెంబరు 3: రివిన్యూ మంత్రి నేడు అసెంబ్లీలో వెల్లడించిన మార్పులవల్ల వాణిజ్యపంట భూముల మీద అదనపు పన్నువల్ల ఆదాయం కోటి రూపాయలు తగ్గుతుందని అనుకుంటున్నారు. బిల్లులో ప్రకటించినట్లు పన్ను వేసిన రు 1.5 కోట్ల ఆదాయం అంచనా వేశారు.

రు 150 లకు మించి శిస్తుకట్టే కమతాల మీద సర్ చార్జీవల్ల ఆదాయం 20 లేక 30 లక్షల మధ్య వుండవచ్చునని ప్రభుత్వవారు అంచనా వేశారు. కాని ఈ ప్రతిపాదనను విరమించుకొనుటకు ప్రభుత్వం నిశ్చయించారు.

## గంజాంజిల్లా కాంగ్రెస్ వాదుల సమావేశం

### కాంగ్రెసులో ఐక్యమత్యాన్ని అర్థిస్తూ తీర్మానం

బరంపురం, సెప్టెంబరు 1: నిన్న సాయంత్రం యిచ్చట వీరయ్యశెట్టి సత్రంలో ఉత్కళ ప్రదేశకాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ విశ్వనాథదాసుగారి అధ్యక్షతక్రింద, గంజాంజిల్లా కాంగ్రెసువాదుల సమావేశము జరిగినది.

పండిత జవహర్లాలు నెహ్రూ, పురుషోత్తమదాసు టాండన్ గార్ల మధ్యనున్న అభిప్రాయ భేదములు సమసిపోయి, వారు ఏకమై కాంగ్రెసు సంస్థను బలీయంచేసి, వచ్చే ఎన్నికల్లో కాంగ్రెసు విజయాన్ని చేకూర్చవలసిందని, కోరుతూ ప్రతిపాదితమైన ఒక తీర్మానము ఆమోదింపబడింది. జిల్లా కాంగ్రెసువాదుల్లో ఉన్న భేదాలుకూడా సమసి పోవాలని, అందరూ కాంగ్రెసు విజయం కొరకు పాటుబడాలని ప్రతిపాదించిన తీర్మానం కూడా ఆమోదింపబడినది. జిల్లా కాంగ్రెసు కార్యవర్గాన్ని పునర్నిర్మాణంచేయుటనుగూర్చి విస్తృతమైన చర్చ జరిగినది. ఒకవర్గం వారికి వీలుగా ఉండే విధంగా ప్రదేశ కాంగ్రెసు సంఘం వర్తిస్తోందని, ఆరోపించారు కొందరు శ్రీ దాసుగారట్టిది లేదని, అందరికీ అవకాశం యిచ్చుటకు తాను తయారుగానున్నానని, చెప్పినమీదట సభలో శాంతి పునః స్థాపితమయినది. (స్వ. వి.)

### నూలు, బట్టలు బ్లాక్ మార్కెట్ ధరలకు అమ్మిన ఫలితం

ఏలూరు, ఆగస్టు 31: స్థానిక అదనపు ఫస్టుక్లాసు మెజస్ట్రేటుగారైన మహమ్మద్ ఆదోనీగారు, ఏలూరు వర్తకుడు మాటూరు సీతారామయ్య నూలు బ్లాకుమార్కెటు ధరలకు అమ్మినందులకు 200/- రూపాయలు జరిమానా, కోర్టు లేచేంతవరకూ శిక్ష విధించారు. చింతలపూడి వర్తకుడు మానం సుబ్బారావు, బట్టలు బ్లాకు మార్కెటు ధరలకు అమ్మినందుకు 100/- రూపాయలు జరిమానా, కోర్టు లేచేంతవరకూ శిక్ష విధించారు.

### ఏలూరు చింతలపూడి వర్తకులకు జరిమానా

### ఫార్వర్డుబ్లాకు, కమ్యూనిస్టు పార్టీల పొత్తు

విజయవాడ, సెప్టెంబరు 3: మార్క్సిస్టు సిద్ధాంతంతో సంబంధం కల సాంఘిక అభ్యుదయశక్తుల అభివృద్ధికిగాను ఆంధ్రా ఫార్వర్డ్ బ్లాకు, ఆంధ్రా కమ్యూనిస్టుపార్టీల సంయుక్త యాజమాన్యాన ఒక సభ ఏర్పాటు కావలసివున్నదని ఆంధ్ర రాష్ట్ర ఫార్వర్డ్ బ్లాక్ ప్రధాన కార్యదర్శి వి. ఎల్. సుందరరావుగారు ప్రకటించారు.

తమపార్టీ ఎన్నికల కార్యక్రమంలో కమ్యూనిస్టు పార్టీతో తదితర వామపక్షులతో కలిసి పనిచేయుటానికి ప్రయత్నిస్తున్నదనివారు తెల్పుతున్నారు. ఇప్పటికే శ్రీ గోపరాజు రామచంద్రరావు, (గాంధి సంఘం) యస్. వి. యల్. నరసింహం, రాటకొండ నరసింహారెడ్డి (శాంతిసభ) గార్లు ఇట్టిమైత్రికి సుముఖత చూపినారని ఆంధ్ర కమ్యూనిస్టు ఎన్నికల పార్టీ కార్యదర్శి కె. యల్. నరసింహంగారు ఈ విషయం తమసంఘం ఎదుట పెట్టనున్నారని సుందరరావు గారు చెప్పారు. (స్వ. వి.)

### కాకినాడ పురపాలక సంఘ ఉప ఎన్నిక

### స్వతంత్ర అభ్యర్థి గెలుపు

కాకినాడ, సెప్టెం 1: కాకినాడ పురపాలక సంఘమునకు 18 వ వార్డు మునిసిపల్ కౌన్సిలరు డి. ఎస్. మూర్తిగారి మరణమువల్ల ఏర్పడిన ఖాళీస్థానమునకు ఉప ఎన్నిక మొన్న టిరోజున జరిగింది. కూనపురెడ్డి సత్యంగారు (స్వతంత్ర) గెలుపొందిరి.

కూనపురెడ్డి సత్యంగారికి 314 ఓట్లు సి. శేషగిరిరావుగారికి 161 వోట్లు, సి కె. రావు (కమ్యూనిస్టు) గారికి 88 వోట్లు వచ్చినవి. స్వ. వి.

### రాష్ట్ర కాంగ్రెసుకు దరఖాస్తులు

మదరాసు, సెప్టెంబరు 4 ప్రజా ప్రతినిధి సభకు కాకినాడ నియోజకవర్గానికి కాంగ్రెసు అభ్యర్థిగా తమను పెట్టవలెనని భారత ప్రభుత్వ ఆహార డిప్యూటీ మంత్రి మొసలికంటి తిరుమల రావుగారు, తిరుపతి నియోజకవర్గమునుంచి ప్రజా ప్రతినిధిసభకు తమను అభ్యర్థిగా ఉంచవలెనని భారత పార్లమెంటు డిప్యూటీ స్పీకరు అనంతశయనం అయ్యంగారూ, ఆంధ్ర ప్రదేశ కాంగ్రెసుకు దరఖాస్తులు పంపుకున్నారు.

## రాష్ట్రాలలో అమ్మకం పన్ను విధానం

### దేశముఖ్ వివరణ

న్యూఢిల్లీ, సెప్టెంబరు 4: అమ్మకం పన్నుకు సంబంధించిన చట్టాలు, విధానము రాజ్యాంగచట్టంలోనినిబంధనకు అనుగుణంగాఉండేటట్లు చూడవలసినదని భారతప్రభుత్వం రాష్ట్రాలకు సూచించినదని ఆర్థికశాఖామంత్రి శ్రీ దేశముఖ్ ఈ రోజున పార్లమెంటులో ప్రకటించారు. తమ రాష్ట్రాలకు వెలుపల జరిగిన క్రయవిక్రయాలపై కూడా కొన్ని రాష్ట్ర ప్రభుత్వాలు అమ్మకం పన్ను విధిస్తూన్నట్లు ఫిర్యాదు వచ్చినదని ఆయన వెల్లడిచేశారు.


## పాదరక్షల డీలర్లు

దసరా, దీపావళి పండుగలు దగ్గరకు వస్తున్నవి. బి. ఎస్. సి. పాదరక్షలకు మీరు ఆర్డరు యిచ్చివున్నారా? లేకపోతే, కాన్వాసు పాదరక్షలకు ఇప్పుడే విజయవాడలో 17/.73, మునిసిపల్ ఆఫీసు రోడ్డుమీద మా బి. ఎస్. సి. హోల్ సేల్ డిపోకు గాని, మీ సమీపమునగల డిస్ట్రిబ్యూటరుకు గాని ఆర్డరు యివ్వండి. తోలు పాదరక్షలలో కొత్తరకములు దొరకును.

బాటా షూ కంపెనీ లిమిటెడ్,
కలకత్తా.


## దక్షిణ రైల్వే

మద్రాసు డిస్ట్రిక్టు, సౌత్ వెస్టు లైనుమీద క్యాకాల్ స్టేషన్ వద్ద 1½" రాతి కంకర సప్లయి చేయుటకు టెండర్లు.

పై పనికి సీలువేసిన టెండర్లు మద్రాసు 3, సదరన్ రైల్వే, రీజియనల్ యింజనీరుగారి ఆఫీసులో 4-10-51 గురువారము పగలు 12 గం.ల వరకు డెలివరీ చేయులాగున కోరబడుచున్నవి.

టెండర్లు నిర్ణీతఫారములో వుండవలెను. టెండరుఫారం ఖరీదు క్రింద సెట్టు 1 కి రు 10/- లు (పదిరూపాయలు) మద్రాసు 3, సదరన్ రైల్వే, ఫైనాన్షియల్ అడ్వైజర్ అండ్ చీఫ్ అకౌంట్సు ఆఫీసరుకు చెల్లించి సదరు రశీదును చూపించి మద్రాసు 3, రీజయనల్ యింజనీరు ఆఫీసు నుండి ఫారములు పొందవచ్చును. ఏ సందర్భములోను టెండరు ఫారం ఖరీదు వాపసు చేయబడదు.

టెండరు ఫారములు 3-10-51 బుధవారము సా. 3 గం. ల వరకు జారీ చేయబడును.

టెండరర్లు తమ టెండర్లతోపాటు ఒరిజనలులో ఇన్ కంటాక్సు క్లియరెన్సు సర్టిఫికేటు దాఖలు చేయవలెను.

మద్రాసు 3, సదరన్ రైల్వే ఫైనాన్షియల్ అడ్వైజర్ అండ్ చీఫ్ అకౌంట్సు ఆఫీసరుకు ముందుగా రు 6,000/- ధరావతుసొమ్ము చెల్లింపవలెను.

తక్కువ టెండరునుగాని మరియే టెండరునుగాని అంగీకరింపవలసిన బాధ్యత రీజయనల్ యింజనీరుకు లేదు.


గనోక్స్యల్

అన్నిసెగలకు గంటలలో గుణము

ఈశ్వర ఫార్మసీ, రాజమండ్రి.

కాల్గేట్ డెంటల్ క్రీము

దంతక్షయమును పూర్తిగా ఆపును!

శ్రీ కృష్ణా, మద్రాసు
(మింట్ బస్ స్టాండ్ ఎదురుగా)
ఫోన్: 4098.

విజయావారి

పాతాళభైరవి (తెలుగు)

16-వ వారము జరుగుచున్నది.
రోజు 3 ఆటలు: మ. 2, సా. 6, రా. 9-45

ఘనసారచందిని

ఎరుపు, తెలుపు, పసిమి, చురుకుగల స్త్రీల కుసుమవ్యాధులన్నిటిని అణచును. సీసా 2/4, అనుపానమునకు వంటవిఅత్తరు సీసా రు 1/- పోస్టేజి ప్రత్యేకం వి. కె. ఏ. అండ్ కంపెనీ, ఆయుర్వేద సమాజము, పేరిదేపి. (నెల్లూరు జిల్లా)

అగురు

మనోహరమైన పరిమళము గలది.

శ్రేష్ఠమైన సుగంధ ద్రవ్యములతో తయారు చేయబడి మనోహరమైన పరిమళము నిచ్చును. భారతదేశ సుగంధ ద్రవ్యములలో అగురు దాని కొక్కటే సాటి.

బెంగాల్ కెమికల్
కలకత్తా బొంబాయి కాన్పూరు
యేజంట్లు:
ఎస్. దేశాయ్‌గౌండర్ & కో.,
41, బందరువీధి మద్రాసు.

జమ్మివారి లివర్‌క్యూర్ పసిపిల్లల లివర్ స్ప్లీన్ వ్యాధులకు

సలహా

మా డాక్టరుగారు ఈ క్రింద స్థలములందు ఆయా తేదీలలో ఉందురు. పసిబిడ్డల లివర్, స్ప్లీన్ వ్యాధుల విషయమై, నియమిత కాలమందు, వారి సలహాను పొందవచ్చును.

| స్థలము | తేది | అడ్రెసు |
|---|---|---|
| తెనాలి | 7-9-51 | C/o గుడివాడ హనుమంతరావు. మెయిన్ బజారు. |
| గుంటూరు | 8-9-51 | ,, జయ మెడికల్సు. కొత్తపేట. |
| విజయవాడ | 9-9-51 | ,, డాక్టరు కళా వెంకటసుబ్రహ్మణ్యం, గాంధినగర్, బకింగ్‌హాంపేట పోస్టు. |
| మచిలీపట్నం | 10-9-51 | ,, ఆనంద ఫార్మసీ. |
| హైదరాబాద్ దక్కన్ | 12-9-51 | ,, డి. కె. పరేఖ్ అండ్ కో, కెమిస్టు, రెసిడెన్సీ బస్ స్టాండ్. |
| సికింద్రాబాద్ దక్కన్ | 13-9-51 | ,, డి. కె. పరేఖ్ అండ్ కో, కెమిస్టు, పాండర్సు రోడ్డు. జామా మసీదువద్ద. |

సంప్రదింపు గంటలు—ఉ. 8 నుండి 11 గం. ల వరకు.
సా. 3 నుండి 5 గం. ల వరకు.

జమ్మి వెంకటరమణయ్య అండ్ సన్సు,
2 బ్రాడీస్ రోడ్డు, మైలాపూరు, మదరాసు.

జమ్మివారి లివర్‌క్యూర్

భారతి

1951 సెప్టెంబరు సంచికలో

కథలు:

హిందీ పరీక్ష — 'కరుణ కుమార'
పుల్లావు పారిపోయింది — 'కురాళ్'
ఐశ్వర్యము — దేశిరాజు వెంకట రమణరావుగారు
బ్రతుకుబాట — ఘట్టి కృష్ణమూర్తిగారు

నాటికలు:

'తదేవగృహం' — 'ఆత్రేయ'
ఆడదిక్కు — చేరుమళ్ళ కామేశ్వరరావుగారు

వ్యాసాలు:

నన్నెచోడని కాలవ... — వేటూరి వెంకట రమణయ్యగారు
పడవ పాటలు — కవికొండల వెంకటరావుగారు
మరాఠీ దండు — మల్లంపల్లి సోమశేఖరశర్మగారు
అపూర్వజాతకము — రాళ్ళపల్లి గోపాలకృష్ణమాచార్యులుగారు

# కాంగ్రెసు కార్యవర్గ సమావేశ కలాపం

## అధ్యక్షుడు టాండన్ ప్రకటన సూచనలు

ఢిల్లీ, సెప్టెంబరు 5: రేపు సాయంకాలము 7-30 గంటలకు ఢిల్లీలో కాంగ్రెసు కార్యవర్గము సమావేశం అవుతుంది. కార్యవర్గములోని తమ సభ్యత్వానికి రాజీనామా నిచ్చినటువంటి పండిత నెహ్రూగారును, అబుల్ కలాం ఆజాదుగారును బహుశః యీ సమావేశానికి హాజరు కాజాలరు కాంగ్రెసు కార్యవర్గంలో సభ్యులుకానట్టి 10 మంది యితర ప్రముఖులకు అనగా డా॥ పట్టాభిసీతారామయ్య, డా॥ బి. వి. రావు, నిజలింగప్ప, శంకరరావు దేవు, పండిట్ డి. పి. మిశ్ర, విశ్వనాథదాస్, మొరార్జీ దేశాయి, సత్యనారాయణ సింహా, సంపూర్ణానందు ఖండూభాయి దేశాయిగార్లకు కూడా ఆహ్వానము లంపబడెను.

కాంగ్రెసు వ్యవహారములందు ఏర్పడిన క్లిష్టపరిస్థితినిగూర్చి తమ అభిప్రాయాభిమతములను వివరిస్తూ నేటి సాయంకాలము కాంగ్రెసు అధ్యక్షులైన పురుషోత్తమదాస్ టాండనుగారొక ప్రకటన చేస్తామని నేడు పత్రికాప్రతినిధులతో అన్నారు.

ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రి పండిత గోవిందవల్లభపంతుగారు నేటి సాయంకాలము కాంగ్రెసు అధ్యక్షునితో 3 గంటలసేపు మాటలాడిరి. కాంగ్రెసు అధ్యక్షునకు, పండిత నెహ్రూకుమధ్య ఏర్పడిన క్లిష్ట విషమపరిస్థితిని పరిష్కరించుటకొరకై పశ్చిమ బెంగాలు గవర్నరు డా॥ బి. సి. రాయిగారు టాండనుగారితో చాలా దీర్ఘ సంభాషణలు జరిపి నేడు ఢిల్లీ నుంచి కలకత్తాకు వెళ్ళిరి. రేపు వర్కింగు కమిటీ సభకు హాజరగుటకై ఢిల్లీకి తిరిగి వస్తారు.

పండిట్ నెహ్రూగారు కాంగ్రెసు కార్యవర్గ సభ్యత్వమునకు కేంద్ర పార్లమెంటరీబోర్డు సభ్యత్వానికి రాజీనామా నివ్వడంవల్ల ఏర్పడ్డ క్లిష్ట పరిస్థితిని గూర్చియే వర్కింగు కమిటీ సమావేశములో చర్చింపబడును.

### కేంద్ర ఎన్నికల కమిటీ సమావేశము

కేంద్ర ఎన్నికల కమిటీ నేటి సాయంకాలము ఢిల్లీలో ఒక గంటసేపు సమావేశమైంది. రాబోయే ఎన్నికలయందు కాంగ్రెసు పార్టీ తరఫు ప్రచారం నిమిత్తమై కావలసిన ద్రవ్యమును వసూలు చేయు విషయమై చర్చింపబడెను. తిరిగి యీ కేంద్ర ఎన్నికల కమిటీ సెప్టెంబరు 10 తేదీని సమావేశమగుటకు వాయిదా వేయబడెను. హిమాచల ప్రదేశమందు అక్టోబరు మాసంలో ఎన్నికలు జరుగుతాయి. కనుక, ఆ ఎన్నికలకై అచటి కాంగ్రెసు అభ్యర్థులు ముగ్గురు యీ కేంద్ర ఎన్నికల కమిటీచే సెప్టెంబరు 10 తేదిని నిర్ణయింపబడెదరు. కేంద్ర ఎన్నికలబోర్డులోని 11 మంది సభ్యులలో 6 గురు మాత్రమే నేటి సాయంకాలం సమావేశానికి హాజరైనారు. పండితనెహ్రూ, మౌలానా ఆజాదు, సి. రాజగోపాలాచారిగారు, మురార్జీ దేశాయి, డా॥ బి. సి. రాయ్, కామరాజనాడారు హాజరుకాలేదు.

### కార్యవర్గ పునర్నిర్మాణానికి అనుమతించాలి

హెచ్. వి. కామతుగారు నేడు చేసిన ప్రకటనలో యిలా అన్నారు: అఖిలభారత కాంగ్రెసు కమిటీ ప్రత్యేకంగా ఆదేశిస్తూ ఒక తీర్మానం చేసినయెడలనే, ఆ తీర్మానాన్ని అనుసరించి కాంగ్రెసు కార్యవర్గమును పునర్నిర్మాణం చేయడానికి వీలవుతుంది. కాని ఒక్క పండిత నెహ్రూగారి యిష్టానుసారంగా అట్టిపని జరగడానికి వీలులేదు. ఒకవ్యక్తి ఎంతటి మహనీయుడైనప్పటికీ, సంస్థయొక్క నియమ నిబంధనావళిని ఆ ఒక్క వ్యక్తియొక్క కోరిక ప్రకారంగా అతిక్రమించడానికి వీలులేదు. అలా అతిక్రమించి వ్యవహరిస్తే నిబంధనావళిని తృణీకరించినట్లవుతుంది. నియంతృత్వాధికారమునకు దారి తీసినట్లవుతుంది.

# ఎ. ఐ. సి. సి. రహస్య సమావేశం

ఢిల్లీ, సెప్టెంబరు 4: సెప్టెంబరు 8వ తేదీని ఢిల్లీలో జరుగనున్న అఖిలభారత కాంగ్రెసు కమిటీ సమావేశము రహస్యంగా జరుగగలదని నేడు అఖిలభారత కాంగ్రెసు కమిటీ కార్యాలయం ప్రకటించింది. ప్రేక్షకులుగాని పత్రికా ప్రతినిధులుగాని సభా సమావేశంలోనికి వచ్చుటకు వీలులేదు.

కాంగ్రెసు కార్యవర్గం సభ్యత్వానికీ కేంద్ర ఎన్నికల కమిటీ సభ్యత్వానికీ పండిత నెహ్రూగారు రాజీనామా యివ్వడంవల్ల ఏర్పడిన విషమ పరిస్థితిని గూర్చి చర్చించుటకై యీ సభ సమావేశమవుతూ ఉన్నది. ఇతర విషయములేమిన్నీ చర్చింపబడవు. అవిశ్వాసపు తీర్మానము లేవిన్నీ సభలో ప్రతిపాదింపబడుటకు వీలులేదు. కేంద్ర ఎన్నికలకమిటీ రేపు సాయంకాలము 6 గం॥కు ఢిల్లీలో సమావేశం కాగలదు. కాంగ్రెసు వర్కింగుకమిటీ సెప్టెంబరు 6వ తేదీని సమావేశం కాగలదు. అ. భా. కాం. కమిటీ సభలో చర్చించవలసిన సారాంశములు ముందుగా కార్యవర్గ సమావేశంలో నిర్ణయింపబడును. ఉత్తర ప్రదేశ ముఖ్యమంత్రి గోవిందవల్లభపంతుగారు, పశ్చిమ బెంగాలు ముఖ్యమంత్రి డా॥ బి. సి.

# పార్లమెంటు శాసన సభలకు దరఖాస్తులు

## 14 వ తేదీవరకు గడువు పెంచుతూ ఆంధ్రకాంగ్రెసు అధ్యక్షుల నిర్ణయం

మద్రాసు, సెప్టెంబరు 6 "ఢిల్లీ ప్రజాప్రతినిధిసభకు రాష్ట్ర అసెంబ్లీకి ఎన్నికలు జరుగనున్న కౌన్సిలు స్థానాలకు కాంగ్రెసుపక్షాన పోటీ చెయ్యదలిచేవారు సెప్టెంబరు 14వ తేదీ 4 గంటలలోపల విజయవాడ ఆంధ్రకాంగ్రెసు కార్యాలయానికి, నిర్ణీత రుసుముతో దరఖాస్తులను పంపుకోవచ్చు" అని ఆంధ్రప్రదేశ కాంగ్రెసు అధ్యక్షులు నీలం సంజీవరెడ్డిగారు ఆంధ్రపత్రిక ప్రతినిధికి చెప్పారు.

సంజీవరెడ్డిగారు ఇల్లా చెప్పారు:- "15 వ తేదీ నుంచి 20 వరకు ముందు రాయలసీమలో ఆంధ్రకాంగ్రెసుఎన్నికల సంఘం సంచారంచేసి అభ్యర్థులను చూడగలదు. తర్వాత సర్కారు జిల్లాలో సంచారం చేస్తుంది. అక్టోబరు 5వ తేదీలోపల మా నిర్ణయాలు అఖిలభారత కాంగ్రెసు ఎన్నికల సంఘానికి చేరగలవు."

# ఎన్నికల సంఘం పర్యటన కార్యక్రమం

మదరాసు, సెప్టెంబరు 6: ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు ఎన్నికలసంఘం ఈ క్రింది కార్యక్రమం ననుసరించి ఆయా జిల్లాలలో పర్యటిస్తారు. దరఖాస్తుదార్లను, జిల్లా తాలూకా కాంగ్రెసు సంఘ అధ్యక్షులను జిల్లాబోర్డుల అధ్యక్షులను వచ్చి కలుసుకొనవలసిందని ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడు కోరారు.

ఎన్నికల సంఘంవారు సెప్టెంబరు 15వ నెల్లూరు, 16వ చిత్తూరు, 17 అనంతపురం, 18 కర్నూలు, 19 ఆదోని, 20 కడప వెడతారు.

పై స్థలాల్లో ఎన్నికల సంఘంవారు ఉదయంనుండి సాయంత్రంవరకు సమావేశమౌతారు. 14 తేదీ సాయంత్రం వరకు దరఖాస్తులకు గడువు వున్నందున వ్యక్తిగతంగా అందరికీ తెలియజెప్పే వ్యవధి లేక పోవచ్చును. గనుక ఈ ప్రకటననే వర్తమానంగా స్వీకరించాలని ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షులు విజ్ఞప్తిచేశారు.

# 18 రాష్ట్రాల్లో జనవరి 3-వ తేదీన పోలింగ్

## ఎన్నికల కమిషన్ ప్రకటన

న్యూఢిల్లీ, సెప్టెంబరు 6: 26 రాష్ట్రాలలో 18 రాష్ట్రాల జనరల్ ఎన్నికల పోలింగ్ తేదీలను ఎలెక్షను కమిషనువారు నేడు ప్రకటించారు. భారత దేశమంతటా పోలింగు జనవరి 3 జనవరి 24 తేదీల మధ్య జరగాలని ఎలెక్షను కమిషనువారు నిర్ణయించి ఈ కార్యక్రమము ననుసరించి స్థానిక పరిస్థితులకు అనుగుణంగా తమకు వీలైన తేదీలను నిర్ణయించాల్సిందని రాష్ట్రీయ ప్రభుత్వాలను కోరారు. ఈ సందర్భమున 18 రాష్ట్రాలు చేసిన సూచనలు అందినవి.

హిమాచలప్రదేశ్, మధ్యప్రదేశ్, ఒరిస్సా, హైదరాబాదు, తిరువాన్కూరు, కొచ్చిన్, భోపాల్, బిలాస్పూరులు తప్పతక్కిన అన్ని రాష్ట్రాల్లోను పోలింగు 1952 సం॥ జనవరిలో ప్రారంభమవుతుంది. ఈ 7 రాష్ట్రాల్లో జనవరికి పూర్వమే పోలింగు జరుగుతుంది. హిమాచల ప్రదేశ్‌లో అక్టోబరు 25 వ నే పోలింగు ప్రారంభమయి డిసెంబరు ప్రారంభమున ముగుస్తుంది.

### 'ఆంధ్ర దీక్షాదినం'

విజయవాడ, సెప్టెంబరు 4: స్వామి సీతారాం ఆంధ్ర రాష్ట్ర నిర్మాణంకోసం సాగిస్తున్న ప్రాయోపవేశానికి సానుభూతి సూచకంగా యీ 9 న విజయవాడలో కనక దుర్గాలయంలో పలువురు ఉపవాసాన్ని ప్రారంభించి, అక్కడినుంచి గుంటూరుకు వెళ్ళవలెనని నిర్ణయింపబడినట్లు అఖిల ఆంధ్రపక్ష సమావేశకర్త శ్రీ ప్రకాశ చంద్ర శతపథి ప్రకటిస్తున్నారు. ఆనాడు ఆంధ్ర దేశంలో ప్రతిచోటా ప్రజలు ఉపవాసం చేయాలని, హర్తాళం జరపాలని వీరు విజ్ఞప్తి చేస్తున్నారు. (స్వ. వి.)

రాయ్‌గారు కాంగ్రెసు అధ్యక్షుని కలిసికుని మాట్లాడిరి. ఇతర రాష్ట్రాలలోని కాంగ్రెసు నాయకులు తమ సలహాలను సూచిస్తూ పండిత నెహ్రూకు ఉత్తరాలు వ్రాసియున్నారు. అ. భా. కాం. కమిటీ ఆఫీసుకు కాంగ్రెసు ప్రముఖులు చాలామంది వద్దనుంచి వందలు ఉత్తరాలకు పైగా వచ్చాయి. వీరిలో అధికసంఖ్యాకులు సూచించిన సలహా ఏమనగా, కాంగ్రెసు అధ్యక్షపదవిని నెహ్రూకు వప్పజెప్పి పురుషోత్తమదాస్ టాండను ఆపదవినుంచి తొలిగిపోవాలి.

అ. భా. కాం. కమిటీ సభ్యులలో కాంగ్రెసు కార్యవర్గసభ్యులను ఎన్నుకొనడం మంచిదని ఉత్తర ప్రదేశ్ కాంగ్రెస్ నాయకులు కొందరు సలహా ఇచ్చారు. కాని, యీసలహా ప్రధాన మంత్రియగు నెహ్రూకు సమ్మతంగా లేదు.

ప్రస్తుత క్లిష్టపరిస్థితిని పరిష్కరించుటకై సూచింపబడిన అనేక మార్గోపాయములందు ఒక క్రొత్తపద్ధతి ఏదంటే, కాంగ్రెసు కార్యవర్గ సభ్యులు అందరూ తమంతటతామే తమ సభ్యత్వానికి రాజీనామాయివ్వాలి. అప్పుడు కాంగ్రెసు అధ్యక్షుడు తిరిగి క్రొత్త కార్యవర్గమును నిర్మాణం చేయవచ్చు.

# మద్రాసు ఆంధ్రకాంగ్రెస్ అధ్యక్ష ఎన్నిక

## చెల్లనేరదని సంజీవరెడ్డిగారి నిర్ణయం

మదరాసు, సెప్టెంబరు 6: "మదరాసు జిల్లా ఆంధ్ర కాంగ్రెసు అధ్యక్షకార్యవర్గానికి మొన్న జరిగిన ఎన్నికలు చెల్లనేరవని నేను ఉభయ పక్షాలకు చెప్పి ఉన్నాను. మళ్ళీ ఎన్నికలు జరుగుతవి. అ. భా. కాం. సమావేశానంతరం నేను తేదీలు నిర్ణయిస్తాను" అని ఆం. ప్ర. కాం. అధ్యక్షులు నీలం సంజీవరెడ్డి గారు ఆంధ్రపత్రిక ప్రతినిధికి చెప్పారు.

### నీలం సంజీవరెడ్డిగారు

ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులు నీలం సంజీవరెడ్డిగారు 7 వ తేదీ రాత్రి విమానంలో బయలుదేరి ఢిల్లీ వెడతారు. 11 ఉదయానికి మద్రాసు చేరుతారు.

## కడపజిల్లా కాంగ్రెసు కార్యవర్గ ఎన్నికల వాయిదా

కడప, సెప్టెంబరు 4: ఈ జిల్లా కాంగ్రెసు కార్యవర్గ ఎన్నికలు నిర్వహించేందుకుగాను ఎన్నికోద్యోగి ఎస్. రంగప్పగారు నిన్న పురమందిరంలో సభను ఏర్పాటుచేశారు. అధ్యక్షుని ఏకగ్రీవంగా ఎన్నుకొనేందుకుగాను రాత్రి 9 గంటల వరకు జరిగిన కృషి వృథాఅయింది. రాజంపేట తాలూకాకు చెందిన డి. పార్థసారథి, ప్రొద్దుటూరు తాలూకాకు చెందిన రావుల మునిరెడ్డిగార్లు అధ్యక్షపదవికై ఆశిస్తున్నారు. సభకు 72 మంది హాజరైనారు. ఎన్నికోద్యోగి ఎన్నికలు వాయిదా పడినట్లు శాన్ని ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షునికి ఎరుకపరచి, మరొక తేదీని నిర్ణయించవలసిందిగా కోరారు. (స్వ. వి.)

## శ్రీ యస్. వి. ఆర్. నాయుడు

ప్రపంచ యువజన మహాసభకు భారత ప్రతినిధులలో ఒకరుగా ప్రతినిధి వర్గానికి ప్రత్యామ్నాయ నాయకుడుగా హాజరైన యస్. వి. ఆర్. నాయుడుగారు అమెరికానుండి బుధవారం ఉదయం మద్రాసువచ్చారు. భారతదేశంపై అమెరికాలో విశేషంగా ప్రతికూలప్రచారం జరుగుతూఉందనీ, ఏవిధంగానైనా భారతదేశాన్ని తమ కూటంలో చేర్చుకొనడానికి ప్రజాస్వామిక రాజ్యాలు ప్రయత్నిస్తున్నవనీ, అందుకే యీ రాజ్యాలు ఎక్కువగా పాకిస్తాన్ ఎడ సానుభూతి ప్రదర్శించడం జరుగుతున్నదనీ వీరు తెలుపుతున్నారు. యువజన మహాసభలో కూడా భారతీయ ప్రతినిధుల చేత నెహ్రూ ప్రభుత్వ విధానాన్ని విమర్శింప చేయడానికి అనేక ప్రయత్నాలు జరిగినట్లు వీరు ప్రకటిస్తున్నారు. భారతదేశం తరఫున తగినంత ప్రచారం లేదని వీరు విచారిస్తున్నారు.

# మదరాసు ధరలు

మదరాసు, సెప్టెంబరు 6.

బంగారు-వెండి నేటిమధ్యాహ్నం 1 గంటవరకు 1-కి ఎద్దువులొమ్ము పేట్టుటాక్సుతో సహా రు. 78.8.0 పెట్టబంగారు తులం 113.8.0 మూల బంగారు 110.12.0 సీమవెండి తులం 100-కి (శెడి) 190.12.0 వెండి తులం 1-కి 1.15.0.

వేరుశనగ: (531 పా 1-కి ఎక్సుకోస్తా గిద్దంగుల మెషిన్ - సేల్సుటాక్సుతో సహా) కదిరి రు. 183, 185

వేరుశనగనూనె ఎక్సుపెల్లర్ విలో 3%

| | |
|---|---|
| నామినల్ (500 పా.) | రు. 352.354 |
| కొంకాయ నూనె (37½ వీసములు గల డబ్బా) ఒకటి– | |
| క్వయిలా | రు. 39-14.9 |
| కాలికట్ యుక్. బ్రాండ్ | 40.0-9 |

### ఆముదం

| | |
|---|---|
| 500 వీసములు గల బారువ ఒకటికి | |
| "తిరువత్తూర్" | రు. 420-0-0 |
| "వరసారావుపేట" | రు. 425-0-0 |

### పంచదార

| | |
|---|---|
| ప్యారీ | 102-0-1 |
| నెల్లికుప్పం | రు. 103-12-1 |

## ఢిల్లీ మార్కెట్ ధరలు

బన్సీధర్ కురియా మల్, సుగంధద్రవ్యముల కమిషన్ ఏజెంట్లు గడోడియా మార్కెట్టు, ఢిల్లీ.

ఢిల్లీ, సెప్టెంబరు 5: 84½ వీసముల మణుగు 1 కి ధరలు మిరియాలు 550-0-0, లవంగాలు 292 293 దాల్చిన చెక్క 85.0-0- కొబ్బరి 172- ఏలకులు- మేజర్ 160-175 దక్కన్(కేజి 1-కి)రు 26, 35-0-0 వక్కలు పెనాంగ్ (మణుగు 1-కి) 89-90 సింహళం 81 82 మంగుళూరు 110 0-0 పచ్చ 85 86 పసుపు సంగ్లి 35 0-0 ఈరోడ్ 30. 37-0-0 నిజామాబాద్ 27-28 దుగ్గిరాల 28-0-0 గట్టి 20 26-0-0. కటోరి 82-0-0 కొబ్బరి - తిప్తూరు 90-95, వగ్గువిచ్చుం 36-37 మెరవ రాయలు 85-86 తెల్లటీలకర్ర 60-85, ధనియాలు. చిన్నవి- 70-80, పెద్దవి 55. 65 ఆల్వాశ మాల్వా 30-35 కర్నూలు 40. 45 సోపు 50.-70, మెంతులు 22-24 మామిడి వరుగు 40- 75, బొప్పాయిగింజలు 58-60 మెహందీ పూల్‌మార్కు 40-0-0, బాదం165 కిస్‌మిస్ 108-110 జీడిపప్పు 165-180.

## హైదరాబాదు (ఉస్మాన్‌గంజ్) మార్కెటు ధరలు

(వట్టయిదారు గుర్బా బచ్చయ్యగారి వెంకటేశం)

హైదరాబాదు, సెప్టెంబరు 6: బంగారం తులం 1కి 130.8-0: వెండి 100 జ 215.0.0. పల్లీ ఒకటికి పసుపు 50-80 పెసలు 44.47-12-0 కందులు 44-47 82.88 53.0.0 బంగలు 42.48 ఉలవలు 68 కందిపప్పు 63- కందిపప్పు చిన్నది 72- పెసరపప్పు 110-112 మినపపప్పు90-100 79.80 వేరుశెనగపప్పు 30.50 ఆముదాలు 110-160 చింతపండు 50 53 మిర్చి 18-27 ధనియాలు 11-12 ధనియాలు 16 శొంఠి మెంతులు 35. 44

# క్రీడారంగం

## పూనాలో క్రికెటు శిక్షణ

పూనా, సెప్టెంబరు 5: ఇండియాలో క్రికెటు టెస్టులలో పాల్గొనే ఆటగాళ్లు దాదాపు 40 మందికి ఇక్కడ ఇంగ్లండు క్రికెటు నిపుణుడు వెల్స్లే చే శిక్షణ నిప్పించుటకు ఏర్పాటు చేయబడినది యీ శిక్షణ కేంద్రమును నేడు దక్షిణ భారత, సర్వసేనాని రాజేంద్ర సింహాజీ ప్రారంభిస్తారు. ఇది ఒక నెలరోజులపాటు నడుస్తుంది.

## ఐ. ఎఫ్. ఎ. షీల్డు ఫుట్‌బాల్

కలకత్తా, సెప్టెంబరు 4: ఐ. ఎఫ్. ఎ. షీల్డు ఫుట్‌బాల్ టూర్నమెంటునందు నేడు మహమ్మడన్ స్పోర్టింగ్ జట్టు, బొంబాయి ఎమెచూర్సు జట్టును ఓడించారు. ఇప్పుడు గెలుపొందిన జట్టు సెమీ ఫైనల్సులో మోహన్ బగాన్ జట్టుతో గాని, కటక్ జట్టుతో గాని ఆడుతుంది.

# రేడియో

## సెప్టెంబరు 8 శని వారం

### విజయవాడ

ఉ॥ 7 తెలుగున వా॥ 7-15 మద్రాసు (బి) వలె. 7-30 మద్రాసు (ఎ) వలె. 8 ఆంగ్లమున వార్తలు.

మ॥ 1 మద్రాసు (బి) వలె. 1-30 ఆంగ్లమున వా॥ 1-40 హిందీలో వా॥ 1-50 తెలుగున వా॥ 4 వనితావాణి తెలుగుతల్లి భానుమతి రజని (బి) శిశుపోషణఆరునుంచి పన్నెండు నెలల వరకు ప్రసంగం పి. కాంతామణి ఫ్రీం పాటలు ఆప్యంగిత పాట ఎన్నికలు ఓటువేయు విధానము ప్రసంగం కె. వరలక్ష్మమ్మ.

సా॥ 5-30 ఉదర నాగరాజా. 5.50 డి. సూర్యప్రకాశ వయొలిన్ 6-10 స్థానిక ప్రకటనలు వాతావరణము. 6-20 గ్రామీణ శ్రోతలకు ఆవాలు 6-30 గ్రామముల కార్యక్రమం దేశవు నంపద వినియోగము అడవులందుపుట్టు ప్రసంగం ఏ పుష్పపూసిన గేయము. విశేషాలు ప్రకటనలు ధరలు వాతావరణము. 7 తెలుగున వా॥ 7-15 గ్రామస్థుల కార్యక్రమం సినిమా సంగీతం (బి) గృహప్రవేశం అదృష్ట దీపుడు అర్బాక్ 7.30 సంస్కృత నాటిక రచన కాండిస్య. 7-45 గీతమంజరి (బి) ఆర్. బాలసరస్వతి వైజయంతి మాల 8 ఉదర నాగరాజా 8.30 సూర్యప్రకాశ వయొలిన్ 9 ఆంగ్లమున వా॥ 9-15 చిత్రవాణి (బి) - పూర్వ సహోదరులు పాటాశక్తివిలీల పాటలు స్వప్నసుందరి శ్రీలక్ష్మమ్మకథ 9.30 ముగింపు.

### మద్రాసు (ఎ)

ఉ॥ 7 స్వాగతము. 7-30 ఎ. సుందరేశన్ 8 ఆంగ్లమున వా॥

మ॥ 1 మహిళామండలి 1.30 గీతమంజరి (బి) 1 40 హిందీలో వా॥ 1.50 సినిమాసంగీతం (బి) 2-10 (బి) వలె. 2-15 ఎస్. రాజమ్ 2-45 గానమంజరి (బి) 4 (బి) వలె

సా॥ 5-30 వి. వి. సీతాదేవ్ వీణ 6 ఆంగ్లమున వా॥ 6-10 స్థానికప్రకటనలు వాతావరణము. 6-20 రాజం వైద్యనాథన్ 7 గీతమంజరి (బి) 7.30 తమిళ ప్రసంగం. 7-45 టి. ఎస్. బాలసుబ్రహ్మణ్యం 9 ఆంగ్లమున వా॥ 9-15 ఆంగ్లమున ప్రసంగం. 9.30 (బి) వలె. 10 పాశ్చాత్యసంగీతం (బి) 10-30 ముగింపు.

### మద్రాసు (బి)

ఉ॥ 7 తెలుగున వా॥ 7-15 ఉదయగానము (బి) టి. వీర ఎల్. వి. వసంతకోకిలం 7-30 నాలానందం నిర్వహణ న్యాయవాది కామేశ్వరి. 8 (ఎ) వలె.

మ॥ 1 టాకీగీతాలు (బి) షాహంశాదు దర్బారు మంత్రికుమారి వఫా మహాల్ 1-30 ఆంగ్లమున వా॥ 1.40 సినిమా సంగీతం (బి) కె. బి. సుందరాంబాళ్ ఎం. ఎస్. సరోజిని మహమ్మద్ రఫీ 1-50 తెలుగున వా॥ 2 వేణువు విలయ విద్వాంసుడు 2-15 పిల్లల కార్యక్రమం తమిళమున 4 పిల్లల కార్యక్రమం ఆంగ్లమున 4-30 పాశ్చాత్యసంగీతం (బి).

సా॥ 5-30 (ఎ) వలె 6-20 సాయం సంగీతం (బి) 6.30 గ్రామస్థుల కార్యక్రమం దేశవు పశుజనసంపద వినియోగము అడవులందుపుట్టు ప్రసంగం ఏ పుష్పపూసిన గేయము విశేషాలు ప్రకటనలు, ధరలు, వాతావరణము. 7 తెలుగున వా॥ 7-15 గ్రామస్థుల కార్యక్రమం సినిమా సంగీతం (బి) గృహప్రవేశము అదృష్టదీపుడు అర్బాక్ 7-30 నక్షత్రమండలము సెప్టెంబరు మాసములో ప్రసంగం 7-45 (ఎ) వలె. 9-30 ఎస్. వి. పార్థసారథి 9-45 ఎ. ఐ. ఆర్. ఆర్కెస్ట్రా 10 శాస్త్రీయసంగీతం (బి) చెంబై వైద్యనాథ భాగవతార్ గురువాయూర్ రామగోపాలకృష్ణ మాయవరం ఎస్. రాజం మధుర మణి అయ్యర్ 10-30 ముగింపు

### హైదరాబాద్

ఉ॥ 7 తెలుగున వా॥ 7-15 తెలుగు హిందీలలో నేటి కార్యక్రమ సమీక్ష 7-20 మాలతి పద్మనాభరావు వయొలిన్ 7-50 భజన్ (బి) 8 ఆంగ్లమున వా॥ 8-15 ఎస్. ఎస్. మంగళ భజన్ 8-25 కన్నయలాల్ తుమ్రీ 8-35 ఖ్యాల దిల్షాద్ 8-50 ఎస్. ఎల్. మంగళ భజన్.

మ॥ 12-30 శాస్త్రీయసంగీత (బి) 1 గీత్ (బి) 1-10 వాద్యసంగీతం (బి) 1-30 ఆంగ్లమున వా॥ 1.40 వరలక్ష్మి (బి) 1-50 తెలుగున వా॥

సా॥ 5.30 చిన్నదమున కార్యక్రమం 6 ఆంగ్లమున వా॥ 6-10 స్థానిక ప్రకటనలు 6-20 హైదరాబాద్ రేడియో ఆర్కెస్ట్రా 6-30 ఖ్యాల దిల్షాద్ 6-45 గ్రామసీమ శర్మలు 7 తెలుగున వా॥ 7-15 గ్రామసీమ రామచరితమును ఉర్దూలో విశేషాలు మార్కెట్ ధరలు వాతావరణము 8-15 హిందీ ప్రసంగం 8-30 మాలతి పద్మనాభరావు 9 ఆంగ్లమున వా॥ 9-15 హిందీలో వా॥ 9-30 ఫిల్మీ కవాలీ 10-15 ముగింపు.

## కార్పొరేషన్ బ్యాండు

మద్రాసు, సెప్టెంబరు 6: రేపు సాయంకాలం ఐదున్నర గంటలకు మెరీనాలో ఓటు బాండ్ స్టాండ్ వద్ద కార్పొరేషన్ బ్యాండు వాద్య సమ్మేళనం ఉంటుంది.

## కావలెను

అనేక రకముల గొప్ప తరగతి వార్నిష్ చేసిన క్యాలెండర్లను అర్డర్లు సంపాదించటానికి ఏజంట్లు: కావలెను. దరఖాస్తుదారులు అర్హతగలవారై యుండవలెను. శాంపిల్సుకు డిపాజిట్టు అవసరము. National Calendar Mfg. Co., Howrah.

Edited Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty Street, Madras.


బ్రైట్ తో మీరు సరిగా వుంటారు

Brite

ఆరోగ్యమైన పండ్లకుంచె ఇండియాలో చేయబడినది.
తయారు చేసినది: బ్రైట్ బ్రదర్స్ లిమిటెడ్, బొంబాయి 7.
ఇండియాకు సోల్ డిస్ట్రిబ్యూటర్లు: కార్ అండ్ కో లిమిటెడ్. బొంబాయి — కలకత్తా — మద్రాసు.
బొమ్మలో మాదిరి ప్లాస్టిక్ డీలక్స్ కంటెయినర్లలో దొరకును
LAS. (B)

బలిష్ఠమైన నరములు
అనేక పురాణవ్యాధులలో నరముల బలము తిరిగి చేకూర్చుటకు ఎలెక్జిర్ గ్లిసరోఫోస్ ఆమోఘంగా పనిచేయును. జబ్బుపడి కోలుకొనునప్పుడు వస్తువ నిచ్చును.
ఎలెక్జిర్ గ్లిసరోఫోస్
నరముల గొప్ప టానిక్
తయారుచేసినది: ఆల్ఫ్రెడ్ హెర్బర్ట్ లిమిటెడ్, కెమిస్టులు, మద్రాసు & బ్రాంచీలు

అతిమూత్రవ్యాధి వారం రోజులలో నెమ్మదించును
మూత్రంతో అధికంగా చక్కెరపోవటం అతిమూత్ర వ్యాధి అంటారు. ఇది యెంత ఉపద్రవకరమైన వ్యాధి అంటే దీని పాలబడినవారు రోజు రోజు మృత్యువుకు అసన్నమవుతుంటారు. దీనికి డాక్టర్లు ఇన్సులిన్ ఇన్జెక్షన్ మాత్రమే కనిపెట్టారు, వాటివల్ల వ్యాధి పూర్తిగా నయం కానేకాదు. ఇన్జెక్షన్ గుణము వున్నంతకాలంమాత్రం చక్కెర తాత్కాలికంగా నిలిచిపోతుంది. ఈ జబ్బు లక్షణాలలో ముఖ్యమైనవి దాహం, ఆకలి, తరచుగా చక్కెరతో మూత్రంబయలు వెడలటము, దురద మొదలైనవి. ఈవ్యాధి ముదిరితే రాచపుండు, కురుపులు, కంటిపొర ఇతర చిక్కులు సంభవించును. వీనస్ ఛారమ్ ఆధునిక శాస్త్రంలో అద్భుతమైన చికిత్స. దీన్ని వాడటంవల్ల వేనకువేలమంది మృత్యు ముఖంనుండి బయట పడ్డారు. దీన్నివాడితే రెండవ లేకమూడవ రోజునుండే, మూత్రంలో చక్కెరతగ్గించి అత్యధిక మూత్రం గూడ నివారిస్తుంది. మూడురోజుల తరువాత మీకుబాగా తేలికయున్నుంది. దీనికి పథ్యంలేదు. ఇన్జెక్షన్లు అవసరంలేదు. ఇంగ్లీషులో వివరములు గలకరపత్రానికి వ్రాయండి. ఉచితంగా పంపుతాము.
50 బిళ్లల బుడ్డి ఖరీదు రు 6-12-0 ప్యాకింగు, పోస్టేజి ఉచితము.
వీనస్ రీసెర్చి లేబరేటరీ, పోస్టుబాక్సు నం.587, కలకత్తా (A.P.)

వారి ఆనందానికి అసలు కారణం
పండిత డి. గోపాలాచార్యులవారి జీవామృతం
నిత్య వ్యవహారాలలో నీరసించిన తండ్రికి జబ్బునుంచి కోలుకొంటూవున్న తల్లికి దిన దిన ప్రవర్థమాన మౌతూవున్న బాలునకు జీవామృతమే బలోత్సాహాలను ఇస్తూవున్నది.
ఆయుర్వేదాశ్రమం లిమిటెడ్ మదరాసు 17.

1 & only Sure Remedy DADRUBINAS for ECZEMA RINGWORM & ALL SKIN DISEASES
SOLE MFGRS. PARTABMULL GOBINDRAM CALCUTTA.
స్టాకిస్టులు కావలెను

నూర్జహాన్ సెంటు
దేవరపల్లి సత్యనారాయణరావు & కో

లిప్టన్స్ జాకూజా డస్ట్
అతి రుచ్యమైన సారవంతమైన టీ
LIPTON'S
LTN-2876

IN GENEVA 3.48 am.
IN GWALIOR 8.18 am.
పైన - జినీవాలో సెంట్‌పీటర్సు కెథెడ్రల్ టవరు - ఒక ఛాయాచిత్రకారుని ఊహాచిత్రము. ఎడమవైపు: గ్వాలియర్ ఫోర్టుకు పోవు రోడ్డు దృశ్యము.
మీ పనిని గురించి ఆయత్తమగుటకు వేళ అయిందని మీ 'వెస్టెండ్' వాచీ హెచ్చరించువేళ జినీవాలోని నజనులు నిద్రావస్థలో వుంటే సమయము. ఈవిధంగా ఊరూరుకు వేళలు మారినప్పటికీ, వెస్టెండ్ వాచీ నమ్మకం మాత్రము మారకుండ ఒకేవిధంగా వుంటుంది.
West End WATCH CO. BOMBAY & CALCUTTA
The BIJOU ALL-SPORTS Everbright Steel Rs. 258.

8-9-51 శనివారం విడుదల
ఆద్యంతము గొప్ప సంచలనము కలిగించు క్రొత్త చిత్రము
ఆటలు, పాటలు, నటనలతో నిండినది.
సనమ్ [హిందీ]
నటించినది: సురయా, దేవానంద్, గోపీ, కె. ఎన్. సింగ్.
సంగీతం: హుస్నాలాల్ భగత్రాం
డైరెక్టర్: నందలాల్ జస్వంతలాల్
మద్రాసు వెల్లింగ్టన్ లో
రోజూ 3 ఆటలు: మ. 3-30, సా. 6-30, రా. 9-30.
ఉదయం 9 గం.ల నుండి మ. 1 గం. వరకు రు. 2-8-0, రు. 1-14-0 తరగతులకు ముందుగా టిక్కెట్లు కొనుక్కోవచ్చును.

వీటిని కొనదగు ఉత్తమం
Platignum MADE IN ENGLAND
పాటినం కలములు, బాల్ పాయింటు
LAS. (B)

ప్రతివారికి బంగాళాదుంప వడ అంటే మిక్కిలి ఇష్టము
డాల్డాతో తయారుచేయబడినవి
మీ భోజన పదార్థములయొక్కయు మరియు తీపి పదార్థముల యొక్కయు (వేడిగానో లేక చల్లగానో తిన్నాసరే) రుచిని అభివృద్ధిచేయుటకు డాల్డా తప్పకుండ సహాయపడును. మరియు డాల్డా అన్ని విధములైన వంటలకు తగినటువంటిది. అది శుద్ధమైనది, పుష్టికరమైనది. తయారగునపుడు చేతితో ముట్టుకొనబడదు మరియు మిమ్ముంలను చేరునపుడు అది సీలు చేయబడిన డబ్బాలలో క్రొత్తగాను, శుభ్రముగాను ఉండును.
ఈ విధముగా సులభముగా చేయవచ్చును
ఉడుకబెట్టబడిన బంగాళాదుంపలను బాగా మెదిపి, మెత్తగా చేసి వాటిని గరంమసాలా, అల్లంముద్ద మరియు కావలసినంత ఉప్పుతో చేర్చండి. తరువాత వాటిని కొద్దిగా వేపండి. తరువాత పిండిముద్దనుండి చదునైన గుండ్రని ముక్కలను ఒత్తండి. ఈముక్కలమధ్యలో బంగాళాదుంప మిశ్రమమునుంచి వాటిని మూసివేయండి. తరువాత చదునైన పిండులవలె చేసి అంచభాగము సరిసమానముగా గోధుమ వర్ణము వచ్చేదాకా ఒక మూకుడులో వేడి డాల్డాలో వేపండి.
దీనిని తప్పిపోకండి!
ఇంగ్లీషులో క్రొత్తడాల్డావంట పుస్తకము — చిత్రములతో గూడినది — ఆర్ట్ పేపరు — ఎనభై పేజీలు — 300 అఖిల ఇండియా మరియు యూరోపియన్ వంటపద్ధతులు — ఆరోగ్యము, పరిశుభ్రత మరియు వంటగృహముల గురించి సూచనలు — ఒక రూపాయి మాత్రమే, పోస్టేజి ఉచితము.
ది డాల్డా అడ్వైసరీ సర్వీస్ పోస్టుబాక్సు నంబరు 353, బొంబాయి 1
HVM. 150-X30 TE.